ఏప్రిల్ - 1992



వెల రూ॥ 4-00

దక్షిణ భారత హిందీ ప్రచారసభ-ఆంధ్ర, హైదరాబాదు-4

ఫోన్: 88866

టెలిగ్రామ్: హిందీసంఘ్

457

# స్రవంతి

## సాహిత్య మాసపత్రిక

ఏప్రిల్ 1992

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ పిన్నమనేని ప్రసాదరావు

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర

ఖైరతాబాద్-హైదరాబాద్-500 004

సంవత్సర చందా

40-00 రూ॥

విడిప్రతి

4-00 రూ॥

**Recommended for use in all the Public libraries and School Libraries by the Director of public Libraries, Andhra State, Madras, Vide proceedings is. No. 30/55 dated 6 th January 1955.**

# ఈ సంచికలో



ముఖ చిత్రం : వసంతుడు

చిత్రకారుడు: నాగార్జున

సంపాదకీయం

# మరో వసంతం లోనికి

జయ నామ సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి— ఉగాదినాడు ప్రారంభింపబడిన స్రవంతి ఆంగీరస చైత్రశుద్ధ పాడ్యమి— ఉగాదినాడు మరో వసంతంలోనికి ప్రవేశించింది. ఇన్ని సంవత్సరాలు స్రవంతి నిరాటంకంగా నడవడం ముదావహం. అనేకమైన వొడిదుడుకుల్ని స్రవంతి ఎదుర్కొన్నది. ఆర్థికంగా గూడా చాలా నష్టాన్ని భరించింది. అయినా ముందుకు నడుస్తున్నది. అందుకు ముఖ్యంగా దక్షిణ భారత హిందీ ప్రచార సభ— ఆంధ్రశాఖకు ధన్యవాదాలు.

తెలుగుభాష సుసంపన్నమైన సాహిత్య సంపద కలిగిన భాష. అది ఉజ్వల చరిత్ర కలిగినది. అటు ప్రాచీన సాహిత్యరంగంలోనే గాక ఇటు ఆధునిక సాహితీరంగంలో గూడా ఎంతో వికాసాన్ని సంతరించుకున్న భాష తెలుగుభాష. తెలుగు కవులసంఖ్య దినదినం పెరుగుతున్నది. కవిత్వమేగాక మిగిలిన సాహిత్యప్రక్రియలలో గూడా రచయితల సంఖ్యకు కొదువలేదు. పాఠకుల సంఖ్యగూడా తక్కువగా ఉన్నట్లు కనబడడంలేదు. అయినా తెలుగు సాహిత్య పత్రికలు తమకాళ్ళమీద తాము నిలబడలేక పోతున్నవి. అది ఎందువల్ల జరుగుతున్నదో అర్థం కావడంలేదు. ఇతర భాషలతో పోల్చి చూస్తే ఈ లోటు కన్నులకు కట్టినట్లు బాగా కన్పిస్తున్నది. ఇది ఆలోచించవలసిన విషయం.

విశ్వ సాహిత్యమంతా ఒకచోటికి చేరుతున్న రోజులివి. భారతీయ భాషా సాహిత్యాలనన్నింటినీ ఒక్కచోటికి చేర్చవలెనని పలుసంస్థలూ, పలువురు వ్యక్తులూ కృషి చేస్తున్నారు. అనువాదంద్వారా, తదితర సాధనాలద్వారా అందుకు ప్రయత్నం చేయవలేనని స్రవంతి అభిలాష. పత్రికను ప్రారంభించడానికి గల ముఖ్యోద్దేశ్యాలలో అదిగూడా ప్రధానమైనది. అంతేగాక వర్తమాన సాహితికి కొలబద్దగా స్రవంతిని మలచవలెనని గూడా మా ఉద్దేశ్యం. అందుకు తగిన కృషిని స్రవంతి చేస్తూ వుంటుంది.

స్వాతంత్ర్యం లభించక పూర్వం పరాయిదేశపు భాష అన్నిరంగాలలోనూ ఆధిపత్యం వహించడం వలన భారతభాషలు వెనకబడి వుండడం అందరికీ తెలిసిన విషయమే. స్వాతంత్ర్యం లభించిన తరువాత ప్రాంతాలలో ప్రాంతీయభాషలూ, కేంద్రంలో హిందీ రాజభాషలుగా అంగీకరింపబడ్డా ప్రత్యేక శాసనాలు చేయబడ్డా ఆయా భాషలకు తగిన ప్రాధాన్య మేర్పడలేదు అందుకు గూడా విశేష కృషి జరగవలసి వున్నది. సాహిత్యేతర రంగాలలోగూడా తెలుగు అభివృద్ధి చెందవలసివున్నది. ఇంగ్లీషు వ్యామోహం ఇంకా ప్రజలలో తగ్గలేదు. స్వభాష యెడల తగినంతగా గౌరవ ప్రతిపత్తులు ప్రజలలో ఇంకా ఏర్పడలేదు. ఆ రంగంలో గూడా స్రవంతి పాటు పడవలెనని కోరుతున్నది.

కాగితం ధరా, అచ్చు ఖర్చులూ రోజురోజుకూ విపరీతంగా పెరిగిపోతున్నవి స్రవంతి ధరను గూడా పెంచవలసి వచ్చింది. గత్యంతరం లేకపోయింది. పాఠకులు మాకు పూర్వంలాగానే సహకారం అందజేయ గలరని విశ్వసిస్తున్నాము. స్రవంతిని సర్వాంగసుందరంగా ప్రచురించడంలో రచయితల సహకారం ముఖ్యంగా అవసరమని భావిస్తున్నాము.

తెలుగువారికి ఈ ఉగాది సందర్భంలో మా శుభాకాంక్షలు అందజేస్తున్నాము.

# సాహిత్యవీధి

## తాళ్ళపాక పెద తిరుమలాచార్యుని 'పద కవితా వైభవం'

జి. విద్యాధరి

తెలుగుసాహిత్యంలో 'పదకవిత్వానికి' ఒక ప్రత్యేక స్థానం ఉంది. తెలుగులో పదకవిత్వం వెలువడిన కాలంలోనే 'సంకీర్తనాయుగం' ప్రారంభమైంది. పద పద్య కవితలలో పద కవిత్వమే మొదట పుట్టింది. తెలుగులో పదకవిత ప్రాచీన కాలంనుండే ప్రజల నోళ్ళల్లో వెలసియుండునని ఊహించుట కాధారాలున్నాయి.

నన్నె చోడుడు (1130) కుమార సంభవంలో ఊయల పాటలను, గౌడు గీతాలను, అంకమాలికలనే రాగయుక్త గేయాలను, అభినయంతో కూడిన 'ఆలతు'లను పేర్కొన్నాడు. ఇవి పద కవితకు చెందిన గేయ ఫణితులే పాల్కురికి సోమనాథుడు (1160-1240) తన కాలంనాటి తుమ్మెదపదాలు, ప్రభాత పదాలు, వెన్నెల పదాలు, వాలేశుపదాలు, నివాళి పదాలు మొదలైన పదాలను, చారుగీతాలను, కోలాట పాటలను, ఛాంగుభళాలు మొదలైన వాటిని పేర్కొనడమే కాక, ఆ యా పాటలోని రాగాలు, శ్రుతులు, తాళగీతులు మొదలైన సాంకేతికాంశాలను కూడా తెలిపాడు. నాచన సోమన (14వ శతాబ్దం) వసంత విలాసంలో 'జాజరపాట'ను పేర్కొన్నాడు.

ఇలా ప్రాచీన తెలుగు కావ్యాల్లో పదాల ప్రసక్తి కనిపిస్తుంది. ఈ పదాలన్నీ 'జానపద గేయ సాహిత్యంగా' రూపొందాయి. ఈ దేశికవిత్వమే 'పదకవిత్వానికి' నాంది అయింది. ఈ గేయాలనే లాక్షణికులు పదాలని, ప్రబంధాలని, ఏలలని అనేక నామాంతరాలతో వ్యవహరించారు. సామాన్యార్థంలో పదాలన్నా ప్రబంధాలన్నా, ఏలలన్నా పాటలే.

'పదం' అంటె 'పాడదగిన కావ్యం' అనిఅర్థం. ఈ నిర్వచనాన్ని శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు పద కవితావిర్భావాన్ని గూర్చి తెలియజేసే సందర్భంలో చక్కగా వివరించారు. ఏ వాఙ్మయంలోనైనా పద్య కవిత్వానికంటే పూర్వం 'పదకవిత్వమే' పుట్టిందని చెప్పవచ్చును.

ఈ పదకవిత్వాన్ని అభివృద్ధి చేయడానికి కృషిచేసిన వారు వాగ్గేయకారులు. వారు రచించి, గానంచేసిన పదాలే పదకవితా వాఙ్మయంగా రూపొందించబడ్డాయి. తెలుగు సాహితీలోకంలో 'పదసాహిత్యం' అభివృద్ధికి కృషి చేసిన వారిలో తాళ్ళపాక కవులు ప్రసిద్ధులు. వీరే కాక త్యాగయ్య

భవాని కాలనీ, రాజేంద్రనగర్, హైదరాబాదు-500 030.

క్షేత్రయ్య, రామదాసు, నారాయణ తీర్థులు మున్నగు వాగ్గేయకారులు కూడా పేర్కొనదగిన వారు. వీరందరూ తెలుగులో 'పద కవితా సాహిత్యా ని'కి ఎనలేని సేవ చేసి వాగ్గేయకారులుగా చిర స్థాయిగా నిలిచిపోయారు.

"వాగ్గేయకారుడు" అనే పదానికి అనేకులు నిర్వచనం తెల్పారు. 'పదంలోని వాక్కును గేయంగా మలచగల సమర్థుడు వాగ్గేయకారుడు'.

శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరంలో వాగ్గేయ కారుని గూర్చి ఇలా నిర్వచించాడు—

శ్లోకం. 'వాఙ్మాతురుచ్యతే గేయం ధాతురిత్యభిధీయతే;
వాచం గేయం చ కురుతే యస్సవాగ్గేయకారకః'

'శబ్ద రూపమైన సాహిత్యం 'మాతు' స్వర రూపమైన వర్ణమెట్టు 'ధాతు'. ఈ రెంటిని చేయు వాడు వాగ్గేయకారుడు. పదకవిత్వంలో శబ్దానికి ఎంత ప్రాధాన్యం ఉంటుందో, గీతికకు కూడా అంతే ప్రాధాన్యం ఉంటుంది. అందే చక్కని సాహిత్యంతోపాటు, మధురమైన పాట కూడా ఉంటుంది. ప్రాచీన కాలంలోని వేదసూక్తాలు అనేకం పాటలుగా రూపొందించబడ్డాయి. సంగీత, సాహిత్యాల మేళవింపే పదకవిత్వం.

సంస్కృతంలో
'స్వరరాగైః ప్రగాయంతి—
గీతమిత్యభిధీయతే'—

అని నిర్వచనం ఉంది. ఇదే విషయాన్ని తెలుగులో తాళ్ళపాక చిన తిరుమలాచార్యుడు తన వాగ్గేయకార లక్షణము'లో వివరించాడు.'వాక్కును, గేయాన్ని రచించగలవాడు వాగ్గేయకారుడు' అని చిన తిరుమలాచార్యుడు నిర్వచించాడు. ఈ విధంగా విశిష్ట లక్షణాలున్న వాగ్గేయకారులెందరో భారత దేశంలో జన్మించారు. అట్టివారిలో ప్రముఖంగా పేర్కొనదగినవారు తాళ్ళపాక కవులు. పదకవితా సాహిత్యాన్ని వెలుగులోకి తెచ్చి, ఒక రూపా న్నందించినవారు వీరే. వీరందరూ "పదకవితా సాహిత్యానికి'' ఎనలేని సేవచేసి కీర్తిగడించారు. తాళ్ళపాక కవులలో ఆద్యుడు, 'పదకవితాపితా మహుని'గా ప్రసిద్ధిగాంచిన తాళ్ళపాక అన్నమా చార్యుడు మొదట చెప్పుకోదగినవాడు. ఇతడి తర్వాత అంతటి స్థానం సంపాదించిన వాడు, వీరి వంశంలో ఎన్నదగినవాడు. 'తాళ్ళపాక, పెద తిరుమలాచార్యుడు. ఈతడి పదకవిత్వంలో ఉన్న సాహితీ వైభవాన్ని, విశిష్టతను గూర్చి చర్చించడమే ప్రస్తుత వ్యాసం ముఖ్యోద్దేశ్యం.

తాళ్ళపాక పెదతిరుమలాచార్యుడు క్రీ.శ. 1458-1554 ల మధ్య జీవించాడు.ఇతడు అన్నమా చార్యుని చిన్నభార్య అయిన 'అక్కలాంబ' కుమారుడు. ఇతడు కూడా తండ్రిలాగే ఆధ్యాత్మ, శృంగార కీర్తనలను రచించాడు. ఇతడు శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తుడు. ఇతడి రచనలలో అడుగడుగునా అతడికి శ్రీ వేంకటేశ్వరుని పై గల భక్తి భావం ప్రస్ఫుటంగా కనబడుతుంది. ఇతడి రచనలలో కూడా ఆధ్యాత్మిక భావాలు, వైరాగ్యం, ప్రస్ఫుటంగా కనబడతాయి. ఇతడు గొప్ప మహిమ కలవాడని—చిన్నన్న ఇలా చెప్పాడు.

'మందెము కోట మండలం బెరుగ
మండలాగ్రహతి మహనీయ పుష్ప
దామమై ధర్మాం గదస్థితిఁ బొలచె
నే మహా మహుని యహీనగాత్రమున'

ఈ విషయాన్నే పెద తిరుమలాచార్యుడు.

'నాటికి నాడు గొత్త నేటికి నేడు గొత్త (6-85)' అనే పదంలో చెప్పుకొన్నాడు.

ఇతడు వేంకటేశ్వర వచనాలకు కర్త. శృంగారదండకం, చక్రవాళమంజరి, శృంగార వృత్తశతకం, వేంకటేశ్వరోదాహరణం, నీతిశతకం, సుదర్శనరగడ, భగవద్గీత తెలుగువచనం మొదలైన వెన్నో మధురకవితలు వెలయించి తరించాడు. ఇన్ని విధాలైన కావ్యాలు, రచనలు చేసిన, అనేక కీర్తనలు వ్రాసి,ప్రఖ్యాతి పొందిన, అన్నమయ్యకు సాటియైన పెదతిరుమలాచార్యుని పదకవితలలో ఉన్న సాహిత్యాంశాలను మచ్చునకు కొన్ని పరిశీలిద్దాం.

పెద తిరుమలాచార్యుని పదకవిత్వాన్ని గూర్చి, అందలి సాహిత్యాన్ని గూర్చి తెలుసుకునే ముందు ఇతడికాలం నాటి సమకాలీన చారిత్రక సంఘటనలను గూర్చి కూడా చర్చించవలసిన అవశ్యకత ఎంతైనా ఉంది.

తాళపాక పెద తిరుమలాచార్యుడు జన్మించు నాటికి సాళువ నరసింహరాయలు పెనుగొండలో సామంత ప్రభువుగా ఉండి అన్నమయ్య యెడల గురుభావం కల్గి యున్నాడు. అతడు 1487 నాటికి విజయనగర సింహాసనం ఎక్కి 1495 వరకు పరిపాలించాడు. ఆటు తర్వాత తుళువ వంశం వాడైన ఈశ్వర నరస నాయకుడు సింహాసనం ఆక్రమించి, కన్నడ రాజ్య రమారమణుడు కావడం, ఆ తర్వాత నరస నాయకుని పెద్ద కుమారుడు వీరనరసింహ రాయలు రాజ్యానికి రావడం, 1509 లో శ్రీకృష్ణ దేవరాయలు విజయనగర సామ్రాజ్యానికి చక్రవర్తి కావడం, ఇవి పెద తిరుమలయ్య ఎరుకలో జరిగిన సమకాలీన చారిత్రక సంఘటనలు.

శ్రీకృష్ణదేవరాయలు సింహాసనం ఎక్కేనాటికి అన్నమయ్య లేడు. పెదతిరుమలాచార్యుడు తిరుమలలో స్వామికి సంకీర్తనముల ద్వారా, అగ్రహార ప్రదానం ద్వారాను కైంకర్యం చేస్తూ, స్వామి సన్నిధిని మంచి పలుకుబడి కల్గియున్నాడు. ఒకానొకసారి [illegible] 504. [illegible] పెద తిరుమలయ్య [illegible] కుపోయి నపుడు అక్కడి మండలాధిపతి 'నరస నాయకుడ'ను వాడు ఆచార్యునిపైకి కత్తివిసరగా, అది పుష్పమాల అయినదట. ఈ సంఘటనపై పెద తిరుమలాచార్యుడు ఈ క్రింది కీర్తనను వ్రాసుకొన్నాడు.

## శంకరాభరణం :

> 'నాటికి నాడు క్రొత్త నేటికి నేడు క్రొత్త
> నాటకపు దైవమవు నమో నమో....
> సిరుల దుర్మార్గపు చేతికత్తి ధార తొల్లి
> వరుస ధర్మాంగదుపై వనమాలాయ
> హరి నీ కృపకలిమి నట్లనే యరులచే
> కరఖడ్గధార నాకు కలువదండాయ...'

ఈ కీర్తన ప్రబల సాక్ష్యముగా కత్తి కలువ దండయిన కథ చారిత్రకమయి యుండును. ఈ కీర్తన వలన తిరుమలా చార్యుని కాలమున జరిగిన చారిత్రక సంఘటన వ్యక్తమవుతుంది.

కృష్ణరాయల తమ్ముడైన అచ్యుతరాయలు పూండి, సంగముకోట గ్రామాలను శాసన పూర్వకంగా పెదతిరుమలా చార్యునకు దానము చేసినట్లు ఆచార్యుడు దానిని తిరిగి స్వామికే సమర్పించినట్లు శాసనం-ఉంది. దీనిని బట్టి పెదతిరుమలా చార్యునకు ఇహలోక భోగములంటే అసక్తి లేదని తెలుస్తున్నది. ఈ విషయాన్ని వెల్లడిచేసే కీర్తనలు కూడా ఉన్నాయి. వైరాగ్యనిరూపణంచేసే కీర్తనలలో తనకు ఈలోకంలోని సుఖాల కంటె భగవంతుని సాయుజ్యమే ముఖ్యమని వెల్లడి చేయడం కలదు. ఉదాహరణకు-

దేశాక్షి :-

ఇద్దరి దేహసంబంధమిదిగో మాయ
గద్దించి యేడనుండునో కడసారి తాను...
తోడబుట్టిన మమత తొడగి కొన్నాళ్ళకు
వాడిక పుత్రుల మీద వలె నుండదు....

భక్తియే శాశ్వత మైనది. భగవంతుని సాయుజ్యాన్ని పొందడానికి శాశ్వతమైన భక్తి కల్గియుండాలి అని అంటాడు.

పెదతిరుమలాచార్యుడు కృష్ణరాయలకు సమకాలికుడు. ఆ రాజు కవి పండిత పోషకుడు. కావున, పెదతిరుమలాచార్యుని తనకొలువునకు పిలిపించినాడు. వేంకటేశ్వర భక్తి విభూతి సంపన్నుడైన పెద తిరుమలయ్య అందుకు అంగికరించలేదు. ఈ విషయం కొన్ని కీర్తనల ద్వారా తెలుస్తున్నది.

ఉదాహరణకు :-

భూపాళ :-

'పోయిన బంధములటు పోవుగాక
ఛీ యని రోసి యెంగిలి చేకొనేదా'

తొల్లి చేసిన కర్మాలు తొలగచేసె గురుండు
చెల్లబో ఇంకనవిచేసేదా
వొల్లక విత్తులు తమ వుముకం బాసినమీద
మొల్లమి క్రమ్మర నవి మొలచేనా' .......

శ్రీవేంకటేశ్వరుని క్షేరం జూపె గురుండు
దావతి యితరులందడవేదా'

అన్నమాచార్యునకు వలె నరులను ఆశ్రయించడానికి పెద తిరుమలాచార్యుడు అంగీకరించ లేదు. నరులకు తన కీర్తనలను, రచనలను అంకిత మీయలేదు. అందుచే రాయలు తన పేరు మీదకాక తిమ్మరుసు, గోవిందయ్యల ద్వారా, తిరుమలయ్య గారిచే స్వామికి కైంకర్యము జరిగేటట్లు ప్రచ్ఛన్నంగా ఏర్పాట్లు చేసినట్లు ఊహించవచ్చు.

పెద తిరుమలయ్యగారి రాజాస్థాన వైముఖ్యాన్ని చాటే మరో కీర్తన.

సామంత :

'తాముం దెలియరు తగం జెప్పిన వినరు
పామరపుం దమ కర్మఫలమో హరి
మాయయో'
ధర గొందరు మూర్ఖులు తననొక్క రాజు
గొల్చి
పరిచారకుని దిట్ట భంగపడ్డట్టు.'...

ఈ కీర్తనల ద్వారా ఎవరో రాజు కొల్వులోని వారు విరసాలాడి తిరస్కృతులైనట్లు స్పష్టంగా స్ఫురిస్తుంది. ఈ విధంగా పెదతిరుమలాచార్యుడు కూడా రాజులను ద్వేషించాడు. వాళ్ళను ఆశ్రయించే వారిని దూషించాడు. కేవలం భగవంతుడైన శ్రీమన్నారాయణుని ఆశ్రయించాడు పెదతిరుమలా చార్యుడు. అన్నమయ్యకువలె పెద తిరుమలా చార్యునకు రాజులవలన కష్టాలు కలిగాయి. శ్రీ వేంకటేశ్వరుని దయవలన వీరి కష్టాలు తొలగాయి.

ఇంక పెద తిరుమలా చార్యుని పద సాహిత్యంలోని వైభవాన్ని, రచనా రమణీయతను పరిశీలిద్దాం. పెద తిరుమలా చార్యుని రచనలలో, పదాలలో చక్కని వర్ణనలు, భావాలు, అలంకారాలు వీటితోపాటు దేశి కవితా రీతులు కూడా ఉన్నాయి. ఉదాహరణకు కొన్ని చూద్దాం.

భావుకత :

ఈ క్రింది పదంలో కవికి ఉన్న భావుకత గోచరిసుంది.

'ఇద్దరి చుట్టరికేలు యెంచి యెంచి పోలుచరే
సుద్దులనే మోహము సూటి పడుఁగాని
॥పల్లవి॥

సతివదనము పూర్ణచంద్రుని బోలుచరే
అతని కన్నులఁగలువ లలరుఁగాని
మితిలేని తురుము తుమ్మెదల బోలుచరే
తతి బతిమోవిదేనెదైలు వారుఁగాని'
॥ఇద్దరి॥

అతిసామాన్యమైన కవి సమయాలనే వాడుకొన్నా, పెదతిరుమలాచార్యుని ఈ పదంలో భావుకత, చమత్కారం, కల్పన, అలంకారికంగా అత్యంత మనోజ్ఞంగా ఉంది.

## వర్ణన :

ఈ క్రింది పదం తిరుమలాచార్యుని వర్ణనా పటిమకు నిదర్శనం.

'అంగన విభుఁగూడే దదియే కాలమో కాక
అంగజుని కిది గాల మాయనోకాక ॥పల్లవి॥

॥చ॥ చెలియ చెంపలనుండి సేవంతి రేకులే రాలె
అలరు వసంతకాల మాయనో కాక
కలికి కన్నులనుండి కన్నీటి బొట్లు రాలె
యెలమి వాన కాలమిదియో కాక ॥అంగన॥

తంద్రితో పోటీ పడుతూ, ఋతుషట్క వర్ణనము చేయడంలో పెదతిరుమలాచార్యుని వర్ణనా వైదగ్ధ్యం స్పష్టమవుతుంది.

## భావచిత్రాలు:-

పదంలో చరణంలోని ప్రతిపాదం, ఒక్కొక్క భావచిత్రంగా గోచరిస్తుంది. ఈక్రింది పదంలోని చరణాల్లోని సగం, సగం ఒక్కొక్క భావచిత్రంగా గోచరిసుంది.

'తలపులో విరహమో తరుణిపై మోహమో
చెలియ సింగారమో చెప్పరమ్మా చెలులు
॥పల్లవి॥

'చిత్తరు పటము మీఁద జెలియ నెమ్మోము వ్రాసి
గుత్తపుఁజందురుఁడని గుండె పగిలె
కొత్తగాఁ గ్రమ్మర నాకె కుచమండలము వ్రాసి
బిత్తరి జక్కవలని ప్రియుడట్టే భ్రమసె....॥
॥తలపు॥

ఇందలి భావచిత్రాలు కనుల యెదుట మూర్తీభవించినట్లుగా గోచరిస్తాయి. ఇది అత్యద్భుత వర్ణన భావగాంభీర్యం ఉంది ఈ పదంలో. పైనుదహరించిన రెండు, మూడు కీర్తనలు మధురభక్తితో కూడిన ఆధ్యాత్మ శృంగార కీర్తనలు.

పెదతిరుమలాచార్యుని కీర్తనలలో అలంకారాలు కూడా అక్కడక్కడా కనబడతాయి. అర్థాలంకారాలు, శబ్దాలంకారాలు ఉన్నాయి. ఉదాహరణకు ఒకటి, రెండు

## అలంకారాలు:-

శబ్దాలంకారం అయిన ముక్త పద గ్రస్తానికి ఒక ఉదాహరణ

'వేంకటేశ్వర స్వామినీ, పద్మావతీ అమ్మవారినీ నాయికా, నాయకులను జేసి సుమారు 120 పంక్తుల వరకు చెప్పిన చక్రవాళ మంజరి అనే ఖండకావ్యంలో ప్రతి పాదాన్ని ముక్త పదగ్రస్తంలో నడిపాడు. అందలి కొన్ని పాదాలు:-

'తన రాక కోరు కాంతామణి యలరు
అలరుల పొదరింటి కరిగి చెల్వార
అరయ చేపట్టి యనుభవం బొసగి
సగియించు గతి ఘర్మ జలమార విసరి
సరిలేని విరహంబు చల్లార్చి కలసి
కలసిగ్గు చేర్చి వెంకట శైలవాస

వాస వాప్పితుకు శ్రీవా మాక్షితోడు ప్రవేశించె
తొల్లిటి నగరు

ఇందు ఆధ్యాత్మిక చింతనతో కూడిన శృంగారం ఉంది. మధుర భక్తికి ఈ ఖండకావ్యం నిదర్శనం,

## అంత్యాను ప్రాస ;

ద్వితీయాక్షర అనుప్రాస ఈ క్రింది పదంలో ఉంది.

'గౌళ'

'అప్పుడే కృతార్థుండు అప్పుడే లోక
పూజ్యుండు
తప్పులేదు ముప్పు లేదు దైవమే గురుతు
ఎవ్వడు పుణ్యుండు కాడు ఎవ్వడు పాతకి కాడు
ఇవ్వల తొంటి జన్మము లెంచి చూచితే
నెవ్వగని జీవునికి నేరుపేది నేరమేది
అవ్వల శ్రీహరి శరణమన్నదే గురుతు
పుట్టని కులములే విభజించని వస్తువేది,...'

ఇచ్చట సమాజపరంగా పెద తిరుమలా చార్యుడు కొన్ని అంశాలను తెలియజేస్తున్నాడు. భగవంతుడి దృష్టిలో జీవులంతా సమానము. మంచి చెడు, పేద, గొప్పఆనే భేదాలు చూడకుండా అంద రినీ శ్రీ వేంకటేశ్వరుడు సమానంగా ఆదరిస్తాడు. ఒకవైపు భక్తి, వేదాంతాలను గూర్చి తెలియజేస్తూనే మరొకవైపు, సమాజంలో ప్రజలంతా కలిసిమెలిసి అన్యోన్యంగా జీవించాలని కోరుతూ ప్రబోధాత్మ కంగా తెలియ జేస్తున్నాడు. అన్నమయ్యవలె కులమత విభేదం ఉండరాదని పెదతిరుమలా చార్యుడు ప్రజలకు ఉద్బోధించెను. ఇది సామాజిక మైన అంశంగా కూడా చెప్పవచ్చు.

తిరుమలా చార్యుడు తన సాహిత్యంలో వర్ణ నలకు, అలంకారాలకు, భావానికి, భక్తి, వేదాంతా లకు ఎంతటి ప్రాధాన్యత నిచ్చాడో అలాగే భాషకు కూడా ప్రాధాన్యత నిచ్చాడు.

జానపద సరళిలో కూడా కీర్తనలు వెలయిం చాడు. శిష్ట సాహిత్యానికి ప్రాధాన్యత నిస్తూనే దేశీయమైన జానపద కవిత్వానికి కూడా సమ ప్రాధాన్యత నిచ్చాడు.

ఉదాహరణకు ఒక కీర్తన.

సుద్దులు అనబడే దేశీయమైన పాటల ఫణితిలో సాగిన కీర్తనలను తిరుమలాచార్యుడు వ్రాశాడు. ఉదాహరణకు ఒకటి-రెండు చూద్దాం.

## ఆహిరి :-

'మాయింటికి రావోయి మాధవా
మాయలెల్ల గంటిమిదే మాధవా,
మచ్చుచల్లేవు వలపు మాధవా
మచ్చిక లెల్ల జేసితి మాధవా'
ముచ్చెము నీపై నిదె మాధవా యింక.
మచ్చరపు చూపులేల మాధవా ........

## లలిత:-

'అసలు చెరచకుమీ అచ్యుతా
ఆ సుద్దులే యీసుద్దులు అచ్యుతా....
అలవాటె తొల్లి నీకు అచ్యుతా
అలయకు మింక నీవు అచ్యుతా నిన్ను
అలమి పట్టెంగాని అచ్యుతా....

## దేసాళం;-

కొల్లవలపులు చల్లే గోవిందరాజ నిన్ను
గొల్లెతలు నవ్వేరు గోవిందరాజ........

శ్రీరాగం:-

వట్టి వలపు చల్లకు విష్ణుమూరితినాతో
వెట్టిదీర మాటాడు విష్ణుమూరితి....

ఇందు జానపద భాష, శైలి, భావము ఉండి అచ్చమైన జానపద గేయాన్ని తలపిస్తున్నది. భాషకు తగిన భావం, భావానికి తగిన వర్ణనా చమత్కారం కల్గియుంది. పెదతిరుమలా చార్యుని కవితా పటిమకు ఇది నిదర్శనం. ఇటువంటివి ఇతడి రచనలలో ఇంకా ఎన్నో ఉన్నాయి.

ఇంత వరకు తిరుమలా చార్యుని పద కవితలలో ఉన్న సాహిత్యం, భక్తి, వైరాగ్యం; కవితా రీతులు, సామాజికమైన అంశాలు ఎలా ప్రతిబింబించాయో తెలుసుకోవడమేకాక, అతడి కీర్తనల ద్వారా తెలియవగు సమకాలీన చారిత్రక సంఘటనలను గూర్చి కూడా విశదపరచడమైనది.

శ్రీ వేంకటేశ్వర స్వామిని తన కీర్తనలద్వారా స్తుతిస్తూ గానం చేశాడు. శ్రీవేంకటేశ్వరస్వామి ఇతడికి మూడు పురుషాంతాల వరకు ప్రత్యక్షంగాను, ఏడు పురుషాంతాల వరకు పరోక్షంగాను, మోక్షం ఇస్తానని వరమిచ్చాడట ఈ విధంగా చక్కని సాహిత్యాన్ని వెలయించి, అనేక రచనలు చేసిన తాళ్ళపాక పెదతిరుమలా చార్యుడి పేరు తెలుగు సాహిత్యం ఉన్నంతకాలం చిరస్థాయిగా నిలిచి పోతుంది. తాళ్ళపాక పెద తిరుమలా చార్యుడు వాగ్గేయ కారులలో ప్రముఖుడుగా, శ్రీ వేంకటేశ్వరుని భక్తుడుగా చిరస్మరణీయుడు. తెలుగు సాహితీ జగత్తులో విశిష్ట ఆదరణ లభించిందనడంలో అతిశయోక్తి లేదు.

# భాషా చారిత్రక దృష్టితో సంధి

— డా॥ ఏ. హనుమంతప్ప

సంధి అంటే వర్ణసంయోగమని సామాన్యార్థం. దీన్నే సంహిత అంటారు. భాషలో ఉచ్చారణ సౌకర్యం కోసం ఒక శబ్దం చివర్లో ఉండే వర్ణం దానికి సన్నిహిత పరమైన ఇంకొక శబ్దం ఆది వర్ణంతో కలియటమే సంధి. కనుక చిరకాలం క్రిందటే సంపూర్ణార్థబోధకమైన అఖండ వాక్యం విడగొట్టబడగా ఏర్పడినవీ, నామాఖ్యాతాది సంజ్ఞల చేత వ్యవహరింపబడుతున్నవి—అయినట్టి ఆ అఖండ వాక్యభాగాలను మళ్ళీ ఆ యా కాలంలోని ప్రజలు సంపూర్ణార్థబోధకమైన వాక్యంగా సమకూర్చేటప్పుడు ఉచ్చారణ సౌకర్యం కోసం ఒక పదాంత్య వర్ణం— దానికి పరమందుండే పదం యొక్క— మొదటి వర్ణంతో చేర్చి పలుకు పద్ధతే సంధి విధాన మవుతుందన్న మాట. అఖండ వాక్యం విభాగింపబడి భాష కొక మారు లక్షణ మేర్పడ్డ తర్వాత, ఆ విభాగింపబడ్డ పదాలు ప్రత్యేక ప్రయోగాన్ని పొందుతూ కాలక్రమేణా అనేక రీతులుగా మార్పు చెందడం తటస్థపడుతుంది కనుక ప్రాచీన వాక్యానికి, తర్వాత కాలంలోని పదాలతో కూర్చబడ్డ వాక్యానికీ కొంత భేద మేర్పడవచ్చు. సంహితలో ఒక తీరులో కూడిన వర్ణాలు సంధి వశాన కొత్త రూపాలు దాల్చవచ్చు. ధీర + అలు = ధీరురాలు. ఇలాంటి భేదాలకు గల కారణాలను తెలుసుకోవడానికి తగిన ఆధారాలు ఆ భాషలోనే మనకు దొరకక పోవచ్చు. కాని సజాతీయ భాషా రూపాలను ఒక దానితో నొకటి పోల్చి చూసినప్పుడు ఈ వికారాలకు గల కారణాలే గాక ప్రాచీన భాషా లక్షణాలు కూడా కొన్ని బయటపడు తుంటాయి.

## నుగాగమ విధానం

ఉదంత తద్ధర్మార్థ విశేషణములకచ్చు పరమైనప్పుడు నుగాగమ విధానం ఆంధ్ర వైయాకరణులు చేసి ఉన్నారు. చేయు + అతడు అన్నది. దీనికి సంధి కలిగితే మధ్యలో 'న' కారం వచ్చి 'చేయునతడు' అనే రూపమవుతుంది. ఈ నుగాగమం అకస్మాత్తుగా మధ్యవచ్చి చేరినది గాకుండా ప్రాచీన భాష నుంచే సంక్రమించిందని పరిశీలిస్తే మనకు తెలుస్తుంది.

'చేయు + న్ + అతడు' అని విడదీసి అజంతమైన 'చేయు' అనేదే తద్ధర్మార్థక విశేషణమని దానికి అచ్చుపరమైనపుడు 'న్' ఆగమ మవుతుందని వైయాకరణులు తెలిపారు. 'చేయున్' అనే 'న' కారాంత మొకటి తప్ప చేయుచున్న, చేసిన అనే వర్తమాన భూతకాలిక రూపాలవలె 'చేయు' వంటి

శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం.

అకారాంతంబైన భావి క్రియా విశేషణ రూంప ప్రాచీనకాలంలో భాషలో లేదు కలుగు-ధాతువు సహాయంతో ఏర్పడ్డ 'చేయఁగల' అన్నది చాలా అర్వాచీన రూపం. ప్రాచీనకాలంలో 'చేయును' అని తద్ధర్మార్థక రూపమే భావి క్రియారూపంగానూ, అది ఒక నామ వాచక శబ్దానికి పూర్వస్థాన మాత్రమంచినప్పుడు విశేషణంగానూ వ్యవహరింపబడుతూ వచ్చింది. భాషలో ఇది అతిప్రాచీనమైన రూపం కావడం చేత ఆ కాలంలో స్థానాన్ని బట్టి క్రియా రూపంగానూ, క్రియాజన్య విశేషణ రూపంగా కూడా వాడుకలో ఉంది. దీనికి అజాది శబ్దం పరమైనప్పుడు చేయిన్ + అతడు-తుది నకారం తర్వాతి అచ్చుతో కలిసి 'చేయునతడు' అని కావటమూ, హలాది శబ్దం పరమైనప్పుడు న కారం జారిపోవటమూ జరిగి ఉంటుంది. తమిళంలో కూడా సంపూర్ణ క్రియారూపమైన 'శెయ్యుం' అన్నదే 'పేయర్' అచ్చం'-అంటే క్రియాజన్య విశేషణంగా కూడా వ్యవహరించబడటమే ఈ వాదానికి సాధక మవుతుంది. 'అదు శెయ్యుం' –అది చేయును అన్నప్పుడు సంపూర్ణ క్రియగానూ, శెయ్యుం మని దర్-చేయు మనుష్యుడు అన్నపుడు క్రియాజన్య విశేషణంగానూ 'శెయ్యుం' అనే అనునాసికాంత శబ్దమే వ్యవహరింపబడుతున్నది. ఈ శెయ్యుం అనే ప్రాచీన శబ్దమే దాని తుది మకారం న కారంగా మారడంచేత 'చేయున్' అని; చివరన ఒక ఉకారం ఊతగా చేర్చుకొనడం వల్ల 'చేయును' అని రెండు రూపాలు తెలుగులో కనబడు తున్నాయి.

ఈ విధంగా 'చేయను + అతడు' అన్నది సంధిలో; చేయునతడు'అని కాగా తరువాతి కాలపు వైయాకరణులు 'చేయు + న్ + అతడు' అని విభాగించి తద్ధర్మార్థక ఉ కారంపై నుగాగమం విధించారు. దీన్ని బట్టి ఒక కాలంలోని భాషను వ్యాకరించి లక్షణాన్ని రచించిన వైయాకరణులచేత 'విశేష కార్యాలుగా' పరిగణించబడి ఉన్న అనేక విషయాలు ఆ భాషయొక్క ప్రాచీన చరిత్ర నన్వేషించి ఇతర సన్నిహిత భాషారూపాలతో పోల్చి చూస్తేగాని సహేతుకాలై సులభంగా బోధపడేవి కావని తెలుస్తున్నది.

ఇక ప్రాచీన కాలంలో వ్యవహారంలో ఉండే అఖండ వాక్యాన్ని వైయాకరణులు భిన్నపదాలుగా విభజించి లక్షణం చేసేటప్పుడు సంభవించిన అనుచిత విభాగం వల్ల గాని లేదా భాష మారటం చేత ప్రాచీన శబ్ద రూపాన్ని గుర్తింపలేని తర్వాతి కాలపు జనసంఘమే చేసిన అలాంటి విభాగం వల్లగాని భాషలో కాలక్రమంగా కొత్త శబ్దాలు ఏర్పడు తూండేవి అనడానికి ఇంకొక నిదర్శనం చూపారు కోరాడ రామకృష్ణయ్యగారు.

## బహువచనరూప నిష్పత్తి : కుజ్ విధానం :

ఎలుక, చిలుక, ఊఁక, ఎముక, ఏనుఁగ, గొడుగు, నక్క, ముక్క, కొలఁకు, మ్రాంకు, కొలఁకు, గవఁకు, నెఱఁకు, గోఁగు, రేఁగు మొదలైన క,గ,కు,గు వర్ణాలు అంతంగా ఉండే శబ్దాలు కొన్ని ఉన్నాయి. వీటిలో కొన్నిటిని అంటే గోఁగు కొలఁకు మొ. వాటిని సాధిస్తూ రూప నిష్పత్తి క్రమాన్ని వ్యాకరణ కర్తలు తెలిపారు (కలన్వాదుల నుర్తంబు కుజగు—బహువచనంబు పరంబగునపుడు నిత్యముగానగు—బాలవ్యాకరణము— అచ్చిక. 18, 19) భాషలో ను వర్ణాంతమే స్వతస్సిద్ధమైన రూపమనీ, కు వర్ణాంతమే దీనికి రూపాంతరమని తెలియటం వల్ల బహువచనంలో 'కులు', 'గులు' అంతంలో గలదొక్కటే రూపమవడం చేత ఈ బహువచన రూపంనుంచి 'లు' అనే

బహువచన ప్రత్యయాన్ని విడదీయటం చేత కొలఁకు మొదలైన 'కు'వర్ణాంత శబ్దా లేర్పడ్డాయని తెలుస్తోంది. తక్కిన సన్నిహిత భాషలలో ఈ శబ్దాలు కు వర్ణాంతాలుగా గాకుండా కుళం, మరం అని అనునాసికాంతా లవటమే—ఈ భాషలలో కూడా ఇవి కొలను, మ్రాను అని నుర్ణాంతాలే గాని స్వతస్సిద్ధంగా కు వర్ణాంతాలు కావన డానికి తార్కాణం.

ఎలుకలు, చిలుకలు మొదలైన రూపాలలో 'కుజ్'కు బదులుగా 'క' వచ్చిందని చెప్పవలసి ఉంటుంది. కాని 'కొలంకు' అనేదానికి కొలను వలె 'ఎలుక' అనేదానికి 'క'వర్ణ విరహితమైన రూపాంతరం తెలుగులో కనబడటం లేదు. కాని వీటిని ఇతర సన్నిహిత భాషారూపాలతో పోల్చి చూస్తే ఇవి ఏకవచనంలో క వర్ణ విరహితములయి ఉండటమూ, బహువచనంలో క వర్ణ, కు వర్ణాలతో కూడి ఉండటమూ మనం తెలుసుకో గలుగుతాము. తమిళ, కన్నడ భాషారూపాలతో పోల్చి చూద్దా. క వర్ణ, కువర్ణాంతాలైన ఏక వచన రూపాలు ఆ భాషలో లేక పోవటమే గాక, బహువచనంలో తెలుగులో 'లు' వర్ణం చేరుస్తున్నట్లే ఆ భాషలలో-'కళ్(-గళ) ప్రత్యయం చేర్చబడటం ద్వారా బహువచనరూప మేర్పడుతున్నదని అర్థమవుతుంది.

| ఏ.వ. | బ.వ. | తె.బ.వ. | తె.ఏ.వ. | |
|---|---|---|---|---|
| త.ఈ | ఈకళు, ఈగళు | ఈఁగలు | ఈగ | |
| త. ఎలి<br>క.తు.ఇలి | ఎలికళ్ | ఎలుకలు<br>(ఎలికలు) | ఎలిక, ఎలుక | |
| త.కిళి,<br>క.గిళి/గిణి | కిళి + కళ్ = కిళిగ్గళు | చిలుకలు | చిలుక | |
| త.యానై | యానైగళ్ | ఏనుగులు | ఏనుగ | ఏనిక |
| క.ఆనె | ఆనెగళు | ఏనుగులు | ఏనుగు | |
| క.త.నరి | నరిక్కళ్ | నక్కలు | నక్క | |
| త.కుళమ్<br>క.తు.కొళ | కుళంగళ్ | కొళంకులు,<br>కొలంకులు | కొలఁకు | |
| త. మరమ్<br>క.మ.మర | మరంగళ్ | మ్రాంకులు<br>మ్రాఁకులు | మ్రాఁకు | |

[త.—తమిళం; క. = కన్నడం; తు = తుళు; మ. = మలయాళం; ఏ.వ. = ఏకవచనం; బ.వ. = బహువచనం]

తమిళ, కన్నడాల్లో ఎలి, గిళి, నరి మొదలైన 'క'కార విరహిత రూపాలుండటం వల్లనూ, కొలఁకు, మ్రాఁకు వంటి 'కు' వర్ణ సహిత రూపాంతరాలు లేకపోవటం వల్లనూ, ఈ భాష

లన్నిటిలోనూ అభిన్నంగా కనబడుతున్న ఈ కు వర్ణ సహిత బహువచన రూపాలు తమిళ, కన్నడ మలయాళాలలో చిరకాలంనుంచి బహువచన ప్రత్యయ మనుకుంటున్న 'గళ్' అనే దానిని చేర్చడం చేత ఏర్పడ్డ తెలుగులో కొలఁకులు, ఎలికలు మ్రాఁకులు మొదలైన బహువచన రూపాలు కూడా ప్రాచీన భాషలోనే అంటే తమిళ, కన్నడాదులు తెలుగుతో విడిపోనికాలంలోనే (మూలద్రావిడంలోనే) ఏర్పడి అప్పటి నుంచి అట్లే ఈ వ్యవహారంలో ఉన్నవనీ, ఈ భాషలు విడిపోయి కాలక్రమంలో ఆ ప్రాచీన రూపాలు ఉచ్చారణ వేగంతో కొంత మార్పు చెందిన తర్వాత తెలుగు వాళ్ళు 'లు' అనే దాన్ని మాత్రం బహువచన ప్రత్యయంగా భావించి దాన్ని బహువచన రూపాల నుంచి విడదీయటం వల్ల కొలఁకు, మ్రాఁకు శబ్దాలు ఏక వచనంలో కొలను, మ్రాను శబ్దాలకు రూపాంతరాలుగా ఏర్పడ్డాయని స్పష్టమవుతున్నది. ఎలుక, చిలుక, నక్క శబ్దాల ప్రాచీన రూపాలైన ఎలి, చిల్కి, నరి మొదలైనవి ఈ భాషలో అంతరించి పోవటం చేత క వర్ణాంత రూపాలే స్థిరపడ్డాయి. భాష చారిత్రక దృష్టితో చూస్తే 'ఎలి' ప్రాచీనరూపం కాబట్టి ఎలిక, ఎలికలు అని 'ఇ' కార మధ్య రూపాలే సాధురూపాలు. అయితే కాలక్రమంలో తుది 'ఉ' కార సాహచర్యం వల్ల 'ఎలి'లోని ఇ కారం కూడా ఉ కారంగా మారటం చేత ఎలుకలు అనీ; ఏనిగలు—ఏనుగులు అనీ; చిలికలు—చిలుకలు అనీ రూపాలేర్పడ్డాయి.

ఒక మూల భాషకు చెందిన ప్రాచీన రూపాల నిష్పత్తిక్రమం జన్యభాషలలో కాలక్రమేణా మరచిపోవటం తటస్థపడినప్పుడు ఆ యా రూపాలను తర్వాతి వైయాకరణులు తమకుతోచిన రీతిలో విభాగించటం వల్ల ఆ భాషలో కొత్త రూపాలు బయలుదేరుతాయి. ఈ విధంగా వైయాకరణులు అనుచిత విభాగం (incorrecting breaking) చేయటం వల్ల కొత్త రూపాలేర్పడతాయన్న మాట.

ఇతర భాషలతో పోల్చి చూసే ఈ చారిత్రక భాషా దృష్టిని 'అభ్యంతర పునర్నిర్మాణం' అంటారు. కోరాడ రామకృష్ణయ్యగారు ఇక్కడ ఇతర భాషలతో పోల్చి చూసి చక్కగా వివరించారు. అయితే అప్పటికి 'అభ్యంతర పునర్నిర్మాణం'లాంటి పరిభాషలు తెలియకుండానే భాషను వివరంగా ఆ పద్ధతిలోనే పరిశీలించటం—ఇక్కడ మనం గమనించ దగ్గ విషయం. ఈ వీరు చేసిన ఇలాంటి చాలా ప్రతిపాదనలు భాషా శాస్త్రవేత్తలకు ఇప్పటికీ ఆమోద యోగ్యంగా ఉన్నాయి. ఏ విధంగా అయితే బయలాజికల్ సైన్సెస్ (జీవశాస్త్రం)లో 'జన్యుశాస్త్రపిత' అయినటువంటి జాన్ గ్రిగార్ మెండల్ అనే జీవశాస్త్ర పరిశోధకుడు జన్యుశాస్త్రం అభివృద్ధి కాని రోజులలో 'జీన్స్' గురించి ఆ పరిభాష తెలియకుండానే ఆ లక్షణాలన్నీ చెప్పాడో ఆ విధంగానే కోరాడ రామకృష్ణయ్య గారు కూడా భాషా శాస్త్రం బాగా అభివృద్ధి కాని రోజులలో పరిభాష తెలియకుండానే అనేక విషయాలు కూలంకషంగా చర్చించారు. మెండల్ జీవశాస్త్రంలోని జన్యుశాస్త్రాని (Genetics) కి మార్గ దర్శకుడు (Trend Setter) అయినట్టే కోరాడ రామకృష్ణయ్య గారు కూడా మొదటి తరం ప్రధాన భాషా శాస్త్ర వేత్తలలో ఒకరై భాషా శాస్త్రానికి మార్గదర్శకు లయ్యారు.

# జానపద స్త్రీల గేయములు-స్త్రీల మనస్తత్త్వము

— వి. సత్యవాణి

జనపదము లందు నివసించు వారు జానపదు లైతే, వారి అనుభూతి పరంపరలకు, అనుభవము లకు అద్దం పట్టునట్టిది వారి నుండి వెలువడిన జాన పద గేయ ప్రపంచం.

అనేక విధములుగ, అనేక రూపములలో అవగతమయ్యేది స్త్రీ హృదయం ఈ గేయములందు బింబ ప్రతిబింబములుగా రూపుదిద్దుకొని రస హృదయులను ఆకర్షించును.

స్త్రీల వ్యక్తిత్వ చిత్రణకు ఆధారములుగ కూడ నిలబడును ఈ గేయములు.

పువ్వు, పుట్టగానే పరిమళించు నన్నట్లు బాలి కల హృదయములు బాల్యమందలి ఆటపాటలందె పువ్వులవలె విచ్చుకొని పరిమళించును. అనాదిగా బాల బాలికలు పాడుకొను పాటలే అయినప్పటికిని అవి వారి మనసులకు క్రొత్తగనే కనిపించి, రంజింప చేసి ఉత్సాహపూరితులను చేయును. 'కాళ్ళగజ్జ కంకాళమ్మ'తో మొదలయిన ఆట 'ఒప్పులకుప్ప ఒయ్యారి భామ'తో గిరగిర తిరిగి' సుబ్బిగొబ్బెమ్మా-సుఖము లియ్యవే- తామర పువ్వంటి తమ్ముణ్ణియ్యవే-చేమంతి పువ్వంటి చెల్లి నియ్యవే—మొగిలి పువ్వంటి మొగుడినియ్యవే' అను కిలకిలారావములవరకు ప్రాకినా మొగిలి రేకు వంటి మొగుణ్ణియ్యవే' అను వేళ బాలికల డెందములందు క్రొత్త పులకలు మొగ్గలు తొడుగు తాయి. మొగ్గ తొడిగిన భావం బావగారిని చూసి మర్యాద చేయుటకు పురికొల్పి 'బావా బావా పన్నీరు బావను పట్టుక తన్నేరు—చావడి గుంజకు కట్టేరు- చప్పిడి' గుద్దులు గుద్దేరు అనునంత వరకు వెళ్ళు తుంది. పరిహాస హాస విలాసభావము పరుసైన వదిన గారి వెంబడి పరుగెత్తి సరదాల పంటను పండిస్తుంది.

'వదినా వదినా వల్లంకిపిట్టా-గదిలో పెట్టి గంజినీళ్ళోయ్య అన్నయ్య కొట్టాడు నువ్వేడ్వ— నేనేడ్వ అని వుడికించు నా మరదలు పిల్ల.

బాల, కౌమార దశలు దాటి యవ్వన దశలోనికి అడుగుపెట్టిన వారిలో ముగ్ధత్వము కొంత, సంద డించు డెందము కొంత తోడుపడగా, వారు పాడు కొను పాటలలో ఒకింత శృంగార భావము తొంగి చూస్తుంటుంది. ఆ కొనమెరుపు తియ్యగా—పొగ రుగా-జాణతనముగా-సుకుమారముగా-అందముగా వెల్లివిరిస్తుంది. 'ఉషాస్వప్నము' సంపూర్ణముగ శృంగార ఖండము. 'ఉష' ముగ్ధనాయిక. ఉష నామె సఖులు స్వప్నమున కనబడిన ప్రియు డని రుద్ధుడాయని అడుగ'అనగానే కాదంచు. ఔనంచు బల్కక అతివ శిరమును వంచెను' 'చేతితో తల

(పోస్టు) నేరేడుపల్లి, (వయా) మల్లేపల్లి, (జిల్లా) వరంగల్

యె త్తి చెలికత్తె నవ్వినను సిగ్గుతో తల యెత్తదు' అనుపాటయందలి పద సంపద ముగ్ధ హృదయ మును తెలుపుతుంది.

శృంగార భావము హృదయమును రంజింప చేసిన పిదప విరహావస్థ ముంచెత్తును. చారిత్రక గేయముని 'పల్నాటి వీర చరిత్రలో'—'విరహ తాపము దొట్టి వేసటపుట్టి పదియవస్థలు మేన ప్రాప్తించి మించ'—బహువేదనంబడి పారంబు లేక ఉసురుసురంచుసు—ఉడుగని జాలి-భావంబులో నుండి భయమును పొంది,—తనువు కంపింపగ తగు మాట మరిచి' అని నాయిక విరహావస్థను గేయగతం చేసినారు జానపదులు.

కోరుకున్న విభుని పొందిన స్త్రీ అతని చేరు వేళ స్త్రీ సహజమయిన సిగ్గును సీతమ్మ వారిలో పొందుపరిచి, 'సీతగడియ' గేయముగా రూపొం దించినారు జానపదులు. ఇందలి శృంగారము వాచ్యముగా కాక ధ్వనిగా వినిపిస్తుంది. సీత రాముని సరసన చేరినదేకాని; 'సిగ్గుతో శ్రీలక్ష్మి విభుని సన్నిధికి చేరగనే-దివ్వే కలకలనవ్వే—ఆకుల వాసన పానుపు మీద-పోకల వాసన పానుపుమీద— గంథంపు వాసన పానుపు మీద—కస్తూరి వాసన పానుపు మీద'గా పరిమళించినది.

అనురాగము నెలకొన్న ఆలుమగల మధ్య అలుకలు సహజము! స్త్రీకి సిగ్గు సింగారమయిన అలుక అందంగా మలిచిన భావం 'సీతమ్మ వారి అలుక'లో వినిపిస్తుంది.

శ్రీరాముడు చిలుకతోపంపిన రాయబారము విఫలము కాగా చిలుక ఉపాయముతో సీతమ్మ అలు కను అతి నేర్పుగా తీరుస్తుంది. 'ఇరుగు పొరుగుల నుండు యింతులందారూ సిరిదేవి అలుకలు తీర్చ బోయిరి వారి వశము గాక వచ్చి కూర్చుంద్రి రఘురాము వంట్లోను లఘువు తప్పింది' అని చిలుక పలుకగనే సీత అలకను మరచి రాముని అస్వస్థత గురించిన బెంగతో శ్రీరాముని చూడ బోయిన సీతలో భర్త పట్ల అనురాగమే గాక స్త్రీ సహజమయిన అమాయకత్వము కూడ మరో సన్నివేశములో కనిపిస్తుంది.

'సీతాదేవి ఆనవాలు' గేయములో ఒకనాడు సీతమ్మ అలంకరించుకొని 'అద్దము లోపల అతివ తన రూపు-అందులో జూచి కురులంకించి ముడవ- ఈ అద్దమున ఈ రూవుతోను-ఇంతచక్కని దేవి యిది ఎవ్వరనుచు?' కినుకతో భర్తను ప్రశ్ని స్తుంది.

'ఏక పత్నీవ్రతుడనని యిచ్చెమా తండ్రి— యిట్టి మాయల సతిని పిలిపించ దగునా?'— అని దెప్పుతుంది

వనవాసానంతరము అన్న, వదిన గారలతో పాటు అయోధ్యకు చేరిన లక్ష్మణుని చెంతనున్న ఊర్మిళను, వదిన శాంతమ్మ పరిహాసమాడుతుంది. ఆ సందర్భములో సీత—

'మా యన్న ఋష్య శృంగుతి వనములో కూడి యడబాయకున్నా' యేమి ఎరుగని తపసిని కేళించి విడిచినావు'—అని సున్నితముగ చురక అంటించిన సరసత జానపద హృదయములలో నిత్యము వెలిగెడు హాస్యజ్యోతి.

జానపదుల స్త్రీల పాటలలో సరస, శృంగార పరిహాసోక్తులే గాక స్త్రీల కరుణా భావ సంజనిత హృదయము కూడ ప్రత్యక్షమవుతుంది.

భర్తను చేరిన ఊర్మిళ సీత గురించిన ప్రస్తా వనలో 'సింహ విక్రములు మీరుండగానూ— సతెట్లు చెరబోయెనూ రాజ్యాధిపతులు మీరుండ

గానూ —రమణెట్లు చెరబోయెనూ' అని అడిగి ఆ కథను విని దుఃఖించినది. ఇంత మంచి మనసు గల స్త్రీకి పాతివ్రత్యము కూడ పరిమళమే.

ఊర్మిళ-నిద్రిస్తున్న వేళ తన శయ్యా గృహం చేరిన పురుషుని ఆనవాలు పట్టి 'అయ్యా మీరెవరయ్యా! యింత ఆగడమున కొస్తిరి ఒక డాలి కోరిగాదా యింద్రునికి ఒడ తెల్ల హీనమాయె. పరసతినికోరి గాదా రావణుడు మూలములో హత మాయె. ఒకడాలి కోరి గాదా కీచకుడు ప్రాణములు కోలుపోయె ఆడతోడున పుట్టు-మా వంటి తల్లి లేదా మీకు' అని అతని ప్రవర్తనను గర్హించి బుద్ధి చెప్పుటకు ప్రయత్నిస్తుంది. పాతి వ్రత్యముతో పాటు భగవద్భక్తియు స్త్రీలకు మెండేనను విషయము స్త్రీల వ్రతాచరణముల వలన తెలియవస్తుంది. "అనుసూయాదేవి''— బతకమ్మ పాటలో కూడ పాతివ్రత్యముతో త్రిమూర్తులనే పసివారినిగా చేసిన అనసూయ దగ్గరికి త్రిమూర్తుల భార్యలు వచ్చి పతిభిక్షను వేడిరి. అందుకు అనుసూయ నోట జానపదులు పలికించిన భావము యెన్నదగినది.

స్త్రీల నమమానింప ఉయ్యాలో-చిత్తమున
దలపోసి ఉయ్యాలో
కపట స్వభావాన ఉయ్యాలో-కాంతలను చెర
చగా ఉయ్యాలో
తలచగా తగునమ్మ ఉయ్యాలో-దండి వారై
నాను ఉయ్యాలో'

స్త్రీలలో యుండెడి భగవద్భక్తి, వ్రతాను ష్ఠానము యెడల గల ఆసక్తిచే అనేక నోములు నోయుదురు. ఆ నోములకు సంబంధించిన కథ, వ్రత ఫలితమంతయును పాట రూపములో కంఠ గతమైయుండును. శ్రావణ శుక్రవారపు పాట, మంగళగౌరీ వ్రతముపాట, కామేశ్వరీ వ్రతము పాట, మొదలగు పాటలు కట్టు యందును, పాడుట యందును భక్తి ప్రపత్తులు తొంగి చూచు స్త్రీల హృదయము యెన్నదగినది.

రక్తి, భక్తి యందేగాక కర్మమార్గ సంబంధ మయిన భావన కూడ స్త్రీల హృదయములలో సందడించి రామదాసు కీర్తనలు అధ్యయనము చేయించును. 'ఏ తీరుగ నను దయ చూచెదవో' అని ప్రార్థించు స్త్రీల నోళ్ళయందు మేలుకొలుపు, మంగళహారతి పాటలును యిళ్ళు కట్టుకున్నవి.

'మేలుకొనవే రాణితులసి-మేలుకోనవే
లక్ష్మి తులసి
అమ్మ నీ బృందావనము-అధికమయిన
భక్తి నలికి'

అనుచు తులసి పూజయందు నిబద్ధమైన తెనుగింటి ఆడబడుచు హృదయము భక్తి సంభరితము.

స్త్రీలకు మాతృత్వము ఎనలేని సంపద— సంతానము కొరకు పడరాని పాట్లు పడుదురు. నోములు, వ్రతములు, తీర్థయాత్రలు సంకల్పింతురు.

'బిడ్డల కోరి గొౢ్రాల నీవు-ఈశ్వరుని
గుళ్ళకు యిటుకలు మోసేవు
రామయ్య గుళ్ళకురాళ్ళు మోసేవు'—

అని సంతాన కాంక్షను స్పష్టపరుచు గేయములు శతాధికములు.

భగవత్కృప వలన కడుపు పండిన స్త్రీల పట్ల గల గౌరవము, ఆచరణ ఆ యా జానపద గేయములను పరిశీలించిన స్పష్టమవుతుంది.

'ఆముదాలు పండిన చేను చూడండి—ఆడ
వారిని కన్నతల్లి నరనీ చూడండి'
మోదుగ పూసిన బీడు చూడండి—మొగ
వాణ్ని కన్న తల్లిమోజు చూడండి'

అని పాడుటలో మగబిడ్డను కన్నతల్లి ఆధిక్యత వ్యక్తమౌతుంది. కన్నతల్లి హృదయము బిడ్డకు పాడెడి పాటలో సువ్యక్తము. తన బిడ్డ సుందరాంగియే—ముద్దుగుమ్మ డే-సరస్వతీ పుత్రుడే.

'అమ్మణ్ణి కన్నులు తమ్మిపువ్వులు
తమ్మి పువ్వులోన కమ్మ తేనెల్లు
చిన్నారి కన్నుల్లో కన్నీటిజల్లు
కన్నీరు చూపకే కరుగు నెడదల్లు
చక్కని నా తల్లి గుక్క పట్టింది
చెక్కుటద్దాలలో చదరనే సంజ
కిలకిలా నవ్వితే కలువల్లుపూసె
కలువ పువ్వులేలె కవికి చూపుల్లు'

అని మురిసి పోతుంది.

అంతేకాదు, తనబిడ్డ గొప్పతనాన్ని గురించి గొప్పగా చెప్పుకుని మురిసి పోతున్న మాతృ హృదయం—

'వీథి నెందరు వున్నాను విసరదే గాలి-
రచ్చ నెందరు వున్నాను రాదమ్మ వాన
చిన్ని నా అబ్బాయి వీథి నిలుచుంటె-
మొగిలి పువ్వులగాలి ముత్యాల వాన'

అని భావిస్తుంది. అందుకొన రాని ఆకాశ మందలి చందమామను సైతము 'చందమామరావె—జాబిల్లి రావె కొండెక్కిరావె— కోటిపూలుతేవె—బండిమీద రావె-బంతిపూలు తేవె-తేరుమీదరావె-తెనెపట్టుతేవెఅని 'పిలుసుంది.

అంతేకాక; ఆడపిల్లను కన్నతల్లి బిడ్డవిషయంలో ఎంత ఆశ పెంచుకొనునో ఈ పాట తెలియ చేస్తుంది.

'అల్లవూరీ పిల్లవాడు పిల్లనడిగేరు పిల్లవాడికి
రూపు రేఖలున్నాయి
ఏటేటి పండేటి భూములున్నాయి-ఊరి పొలి
మేరలో తోటలున్నాయి
చుట్టు కొల్లారంపు మిద్దెలున్నాయి—కుఱ్ఱవానికి
మంచి సేద్యమున్నాది
మన పిల్లకు తగిన యీడుజోడేను—కన్నె
నిస్తామని కబురంపుదాము'

అని అన్ని విధముల తగిన సంబంధముగ ఎన్నుకొంటుంది. బిడ్డను అప్పగించు సమయంలో తల్లి ఆవేదన జానపదుల పాటగా ఒదిగి కన్నీరు తెప్పిస్తుంది.

అత్తగారింట అప్పగింపేముందు-'ఈ బాల
ఎరుగదు ఏమియునైన
ఆకలెరుగదు అన్నంబు పెట్టినదాక—అడుగ
నేరదు నీ వడిగి పెట్టమ్మా
కోడలు నీసొమ్ము-కొడుకు నీ సొమ్ము-ఆడువారిని
గన్న అలుసింతె నమ్మ'

అని బిడ్డ అమాయకత్వమును వివరిస్తుంది.

'ఎవ్వరే మాడినయెదురాడకమ్మా—పలుమారు
పలుతెరిచి నవ్వబోకమ్మా
నాతోటి చేసిన మంకు పోరెల్ల—యెరుగని
అత్తింట్లో చేయ బోకమ్మా'

అని బిడ్డకు కూడ బుద్ధులు గరుపుతుంది.

అత్తింటి కోడలు, బాధ్యతగల యిల్లాలు క్రొత్తగా కాపురమునకు వచ్చిన కోడలి పరిస్థితి 'సీతగడియ' పాటలో తెలియ వసుంది.

'అత్త కౌసల్యకు అడుగులు వత్తి మామ
దశరథులకు మడతలందిచ్చి
సుమిత్రకైకలకు సురటీలు వేసి'

తానలంకరించుకొను నప్పటికి ప్రొద్దు పోయినది. పళ్ళు ఫలహారములతో శయ్యాగృహము చేరునప్పటికే అర్ధరాత్రయినది. భర్త అలగగ; స్త్రీ హృదయ చిత్రీకరణ ఈ పాటలో పొందుపరచినారు జానపదులు.

'నిలుచుండ పాదాలు చేతులునొచ్చె—
దంతపు తలుపులు తీయవోయి నాథా!
కరుణించి తీస్తివా-కాళ్ళ కడనైన
మంచి ఒక నిద్రైన కరుణించిపోదు'

అని సీత తన అసలు సిసలైన యిల్లాలి తనమును సౌమ్యముగా విన్నవించు కొంటుంది.

'సుభద్రసారె'లో—చెల్లెలు సుభద్రకు కృష్ణమూర్తి భూషణములు, వస్త్ర వాహనములు, పసుపు కుంకమలు సారెగా యిచ్చును. పుట్టినింటి సిరి సంపదలు కొని పోవుట కృష్ణమూర్తి భార్యామణికి నచ్చదయ్యెను. సుభద్ర పోయి వత్తునని వదినతో చెప్పబోవ; ఆమె కోపముతో

'ఇల్లు విరుసుకు పొమ్మ ఓ ముద్దుగుమ్మా
ఏడధాన్యంబుండె యెత్తుకుని పొమ్మా
కాళ్ళ మెట్టెల జోడు యెత్తుకుని పొమ్మ
కట్టుకొను బట్టొకటి వుంచకమీ'

అని కోపగిస్తుంది.

వాస్తవమునకు యిటువంటి కధనము, సుభద్రా కృష్ణులకు, రుక్మిణి సత్యభామల వంటి వారి మధ్య ఊహించతగినది కాదు. జానపద ప్రజా జీవితముసాధాకరీ కరణముగా రూపుదిద్దుకొని స్త్రీల యందలి యే మూలనో ఒదిగియుండు అసూయ, ఈర్ష్యలు, నిందాగర్భితమగు భాషణము ఈ గేయము లందును చోటుచేసుకున్నవి.

స్త్రీకి పుట్టింటివారి పట్ల గల సహజమయిన ఆత్మీయత కూడ 'సుభద్రసారె'లో సుభద్రార్జునుల సంవాదములో యిమిడిపోయినది. పుట్టింటి వారిని హేళన చేసిన అర్జునునితో సుభద్ర మా వాళ్ళు పేదవారు, మాకేమిగలదు-పెట్టగల పెద్దింట పెళ్ళాడితేను—అచ్చటలు ముచ్చటలు అన్నియును జరుగు' అని సమాధాన మిస్తుంది.

కుటుంబ కలహములు, అశాంతి, అలుమగల తగాదాలు, యివి సర్వసామాన్యమైనవి. కజ్జా పెట్టుకున్న భర్తతో బింకము సడలని భార్య

వంకాయ వండేను-వరికూడు వండేను
తినమని చెప్పవే తడికో తడికా"

అని రాయబారమంప సంధికి వచ్చిన మగడు

'పట్టుచీర తెచ్చేను-పెట్టెలోన పెట్టేను—
కట్టుకోమని చెప్పవే తడికో తడికా"

అని రాయబారము సాగిస్తాడు.

ఇంత బిగిసిన భార్య పట్టుచీరె భ్రమలో పడి పట్టుదల విడిచిపెట్టి, అలకను మానుట అతివలకు నూత్న వస్త్రములపైన, ఆభరణముల పైన గల మోహమును స్పష్టపరుస్తుంది.

అత్త కోడళ్ళ మధ్యగల తగువు కూడ వారి మనస్తత్వ చిత్రీకరణ యందు పాలు పంచుకుని సాక్ష్యముగా నిలుస్తుంది.

జానపద గేయములందు అత్తకోడండ్ర మనస్తత్వములను ప్రదర్శించు గేయములు కోకొల్లలు. అత్తకోడండ్ర మధ్య సామరస్య మనునది ఎక్కడో క్వాచిత్కముగా కనిపిస్తుంది.

తానును ఒకనాటి కోడలినేనని ఆత్తగా మారిన అతివ గుర్తుంచు కొనదు. అందుచేతనే కోడలిని 'కోడలా! కోడలా! కొడుకు పెండ్లామా!' అని సంబోధిస్తూ 'పచ్చిపాల మీద మీగడాలేవి!—వేడిపాలమీద వెన్నెల్లు యేవి?' —నూనె ముంతల మీద నురుగుల్లు యేవి?' అని ప్రశ్నిస్తుంది.

గడుసరి అయిన ఆ కోడలు—'పచ్చిపాల మీద మీగడుంటుందా?

వేడి పాల మీద వెన్నలుంటాయా?
'నూనె ముంతల మీద నురుగులుంటాయా?'

అని అడుగుతూనే 'ఇరుగు పొరుగులార!—ఓ చెలియలారా! అత్తగారి ఆరళ్ళు చిత్తగించండి, అని వడ్డిస్తుంది.

భర్తను మరొక స్త్రీతో పంచుకోనని స్త్రీ సహజ మనస్తత్వము 'సవతుల కయ్యము'—'గంగా గౌరీ సంవాదము' మొదలగు గేయము లందు స్పష్టపడుతుంది

ఇన్నిటితో పాటు వీరత్వము, సాహసప్రియత కూడ స్త్రీలకు పెట్టని ఆభరణములని లక్ష్మీబాయి, రుద్రమ్మల జీవిత కథనముల ద్వారా స్పష్టము.

జానపద చారిత్రక గేయమయిన 'బంగారు తిమ్మరాజు' కథలో తిమ్మరాజును చంపవలెనను ఉద్దేశముతో వేశ్యఅయిన రంగసాని సైన్యమును సమకూర్చుకుని తిమ్మరాజును చంపుటకు ప్రయత్నిస్తుంది. తిమ్మరాజును పాలిచ్చి పెంచిన పెంపుడు తల్లి రమణమ్మ—

జట్టీలాగు తొడుగుకున్నదయ్యా పల్లెపు
రమణమ్మా!'

పురుష వేషమువేసె దయ్యాపల్లెపురమణమ్మా
డాలు కత్తి చేత బట్టెను పల్లెపు రమణమ్మా
మేఘ రంజి గుఱ్ఱము నెక్కె పల్లెపురమణమ్మా
ఆరువేలను గడియ లోపల నిలువన నరికింది
ముక్కముక్కలుగ నరికినదయా సానిదానిదండు'-

వేశ్యను యెదుర్కొన్నది పల్లెపు రమరణమ్మ. చివరకు రంగసాని బల్లెము రమణమ్మ హృదయమున దూరిపోయినది. అప్పటికి విషయము తెలిసిన తిమ్మరాజు గాయము మాన్పి కుదుట పరుతు ననగా

'వేటు వద్దా ప్రాణము నాది యెంగిలిజీవమురా
నీ చేతులతో దహనం చెయ్యి, నా ముద్దుల
కొడుకా'

అంటు ఆ వీర నారీమణి ప్రాణము వదిలినది. ప్రేమ, త్యాగము, వీరత్వములు మూర్తీభవించిన స్త్రీ హృదయం పల్లెపు రమణమ్మలో దర్శనమిస్తుంది

స్త్రీ హృదయమందలి సుకుమారత, సుందరత, సున్నితతత్వము, ప్రేమ, దయ, చమత్కృతి, వీరతలు జానపద గేయములందు పరిఢవిల్లి హృదయ బంధములైనవి.

ఆంధ్ర సాహిత్య సరస్వతికి పల్లెపట్టులందు రవళించు మంజీర నాదమును, సుగంధ భరిత సుకుమార సుమమాలికలను సమర్పించిన జానపద గేయములు సహృదయుల హృదయములందు నిత్య నూతనానందమును కలిగించు రస గుళికలు, రమ్య

# తిరుపతి వేంకట కవుల శైలీ ప్రభావం

— రాపాక ఏకాంబరాచార్యులు

ఎక్కడఁ జూచినన్ గవులె యొక్కడఁ
జూడ శతావధానులే
యెక్కడఁ జూడ నాశుకవు లెక్కడఁజూడ
ప్రబంధకర్తలే
దిక్కరులంచుఁ బేర్వడిన తిర్పతి వేంకట
సూరులేఁగు నా
ప్రక్కల నెల నీ కడుపు పండినదమ్మ!
తెలుంగు దేశమా!'

అని శివరామశాస్త్రిగారు తిరుపతి వేంకట కవుల గూర్చి చెప్పిన పద్యము ప్రత్యక్షర సత్యము. జగదాశ్చర్య కరావధాన కవితా సంపన్నులైన తిరుపతి వేంకట కవులు ఆధునిక కవితా వైతాళికులు, కవనార్థంబుదయించిన విద్వత్కవులు, అవతార పురుషులు.

వారి జన్మమునకు పూర్వము మూడు శతాబ్దములు అంధకార బంధురమైయున్న ఆంధ్రవాఙ్మయమును ఉద్ధరించుటకు జన్మించిన కారణ జన్ములు వారు. రాజాస్థానములో విద్వత్కవులమధ్య నర్తించు కవితా కన్యను తిరుపతి వేంకటకవులు తమ అవధాన ఆశుకవితా ప్రదర్శనల ద్వారా ప్రజా మధ్యమునకు తీసికొనివచ్చి ప్రజలలో కవితపై మక్కువ కలిగించిన కవితా ప్రజాస్వామ్య వ్యవస్థాపకులు. ఈ శతాబ్ధారంభంలో పండిత పామర జనం ఎవ్వరి నోట విన్నా వారి పద్యాలే. తిరుపతి వేంకట కవుల కవితా ప్రభావానికి లోనైన నిరక్షరాస్యులు అక్షరాస్యులు కావాలని, అక్షరాస్యులు కవిత్వం చెప్పాలని, కవులు అవధానాలు చేయాలని ఆశుకవితా ప్రదర్శన నివ్వాలని కాంక్షించేవారు. వారి కవితా వెల్లువ ఆనాడు తెలుగు ప్రజానీకాన్ని రసాంబుధిలో మునిచి తేలియాడించింది. 'వాసిలో తడవని వారు మద్గురు వధాన మృదూక్తి మరంద ధారలో కడుగని వారు మా కెచట కానగరారిల తెల్గునాడునన్' అన్న విశ్వనాథ వారి మాటలు అక్షరాల నిజం. శతావధానం అనే స్రవంతి చిత్ర భారతం వ్రాసిన చరికొండపై పుట్టి తిరుపతి వేంకట కవుల కాలానికది తీర్థరాజమై దివ్య స్రవంతిగా రూపొందింది.

శిష్యులు ; ఆనాడు తిరుపతివేంకటకవుల కవితా మాధుర్యానికి, శైలీ ప్రభావానికి లోనై వారివద్ద శుశ్రూష చేయాలనే కుతూహలంతో అనేకమంది యువ కవులు వారి వద్దచేరి తిరుపతి వేంకట కవుల వలెనే పద్యాలు చెప్పాలనీ వెంకటశాస్త్రిగారి జలద గంభీర స్వరాన్ని అనుకరిస్తూ పద్యం చదవాలని ఉబలాటపడేవారు. ఆనాడాంధ్రదేశంలో ఎక్కడ చూచినా

రిహాబిలిటేషన్ ఆఫీసర్, సింగూరు ప్రాజెక్టు, సంగారెడ్డి, మెదక్ జిల్లా.

తిరుపతి వేంకటకవుల శిష్యులే, ప్రశిష్యులే, ఏకలవ్య శిష్యులే, వేలూరి, వేటూరి, అవ్వారి, ఓలేటి, నెమలూరి, పింగళి, కాటూరి, విశ్వనాథ, మాధవపెద్ది మున్నగు శిష్య ప్రకాండులను సంపాదించిన కీర్తి వారికే దక్కింది. 'చెళ్లపిళ్ల వేంకన గురువంచు చెప్పికొనగా నది గొప్పతెలుంగు నాడునన్' అన్న వాక్యం నుడిగా రూపొందింది. పుంభావ సరస్వతులైన తిరుపతి వేంకట కవులు — దివాకర్ల తిరుపతి శాస్త్రి చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారల జంట. ఒకరిది భీమవరం సమీపంలోని ఎండగండి, రెండవవారి జన్మస్థలం ఫ్రెంచి యానాం. అడవిలోని ఉసిరికాయ, సముద్రపుటుప్పు కలిసిన విధంగా వారు బ్రహ్మగురు సన్నిధిని కలిశారు. షట్కర్మనిపేదియైన చర్ల బ్రహ్మయ్య శాస్త్రి గారి వద్ద వారు భాష్యాంతం వ్యాకరణం పఠించారు. విధాతవలె చర్లవారు సాహిత్య జగత్కళ్యాణం కౌఱకు శిష్యుల నిద్దరినీ జంటగా కవితాగానం గావింపుడని ప్రోత్సహించారు. వెంకటశాస్త్రిగారు గోణము కట్టుటాది కోమల కవిత చెప్పనేర్చారు. వారే తిరుపతి శాస్త్రిగారికి కవితామర్మాలను, ఒడుపులను తెలిపి వారిని నిర్దుష్టమైన కవిత చెప్పే విధంగా దిద్దారు. అందువల్లనే తిరుపతి శాస్త్రిగారు వెంకట శాస్త్రిగారిని గురుస్థానంలో ఉంచుకొని

> 'వితతాత్మీయ శతావధాన కవితా విద్యా
> పయోరాశి, సం
> భృత శిష్యాంబుద వాఙ్మయామృత రస
> ప్రీతాఖిలాంధ్ర క్షమా

భృత రక్షఃదసికావతంస కృతవనంది స్తోత్ర మాలా విభూషితు మా వేంకట శాస్త్రి నేఁబొగడెదన్ శిష్య స్వరూపంబునన్ అని స్తుతించారు.

మున్ముందుగా తిరుపతి వేంకట కవులు కాకినాడలో అష్టావధానం, పిమ్మట అచ్చటనే శతావధానం కూడా చేశారు. పిమ్మట వారు అమలాపురం, ఏలూరు, విజయవాడ, గుంటూరు, నెల్లూరు, మద్రాసు, రాజమండ్రి విశాఖపట్టణం మున్నగు పట్టణాలలోను, గద్వాల వనపర్తి, ఆత్మకూరు, వెంకటగిరి, విజయనగరం మొగల్తుర్రు, మున్నగు రాజాస్థానములలోను నహి ప్రతి యన్నట్లు అవధానసభలు, ఆశుకవితా ప్రదర్శన లిచ్చి రాజులను, కవిరాజులను, సాహితీపిపాసువులైన ప్రజలను తమ మృదు మధుర శిరీష కుసుమ పేశల కవితా రసాంబుధిలో నోలలాడించారు. వారి అసాధారణ ధీశక్తి, ధారణ, ఆశువునకు తలలు వంకించి తెలుగుమన్నీలెందరో వారికి సత్కారాలు చేసి కానుకలొసిగారు. ఆత్మకూరు సీతారామ భూపాలుడు వారికి గజారోహణోత్సవం గావించారు. గద్వాల భూపతి జయపత్రం బిరదములను ప్రసాదించారు. ఆనంద గజపతి కానుకలిచ్చారు. వేంకటగిరి విభుడు వేనూట పదారులిచ్చారు. బాలసరస్వతి బాలకళానిధి, విద్వత్కవీంద్ర, కింకవీంద్ర ఘటా పంచాననులు అనుబిరుదములచే వారు సత్కరింపబడ్డారు.

తిరుపతి శాస్త్రిగారు 1900 నుండి 1918 వరకు పోలవరం జమీందారు ఆస్థానకవిగా నుండి, పిమ్మట కొద్దికాలం కోలంక జమీందారిణి సంస్థాన కవిగా నుండి 1920లో దివంగతులయ్యారు.

వెంకట శాస్త్రిగారు 1903 నుండి 1916 వరకు బందరు హిందూ హైస్కూలులో ఉద్యోగించారు. 1933లో బందరు పౌరులు వెంకటశాస్త్రిగారి షష్టిపూర్తి సన్మానం ఘనంగా జరిపారు. ఆ సందర్భంలో శాస్త్రిగారికి శిష్యులు, ప్రజలు బ్రహ్మరథం పట్టి పద్యోపహారాలు, కానుకలు ప్రసాదించారు. నవయుగ కవిచక్రవర్తి, కవికోకిల జాషువా కవి ఆ సందర్భంలో చెప్పిన పద్యం స్మరింప దగ్గది.

'తెలుగు జగాన నేడు గడితేరిన బాలకవీంద్రు
లెల్ల మీ
పలుకుల పందిటన్ జిగురు బట్టిన మొగ్గలు
మీ వధాన కౌ
శలమున నూగి పోయిన దిశాలవలయమ్ము
ప్రసన్నబుద్ధిమై
వలగొని మీ కొసంగెడు నుపాయనముల్ గొను
మయ్య సత్కవీ!'

1949లో మద్రాసు ప్రభుత్వం వెంకటశాస్త్రి గారిని ఆస్థానకవిగా నియమించింది. నన్నయ్య, తిక్కనలనాటి వైభవ మానాడు శారదాదేవికి జరిగింది రాయలసీమ కవి గడియారం వేంకటశేష శాస్త్రిగారు వెంకటశాస్త్రిగారి నిట్లు

'జయ మేపార శతావధాన కవితా సామ్రాజ్య
పీఠంబు న
చ్చయశోమూలముగాగ నేలిన మహా సార
స్వత జ్యోతి రు
చ్చయమౌ వేంకట శాస్త్రి యాంధ్ర కవితా
స్థానీ ప్రభుండయ్యె, న
న్నయ తిక్కన్నల నాటి వైభవము
లీనాడయ్యె వాగ్దేవికిన్'

అని ప్రశంసించారు. వెంకటశాస్త్రిగారు 1950లో శివరాత్రి పర్వదినం నాడు పరమపదించారు.

## గ్రంథ రచనలు :

అర్థశతాబ్దికాలం ఆంధ్రకవితా సామ్రాజ్యాన్ని యేలిన కవి సార్వభౌములు తిరుపతి వేంకట కవులు. ఒక ప్రక్క దేశాటనంచేసి అసంఖ్యాకంగా అవధానాలు, ఆశుకవితా ప్రదర్శనలు జరిపి, మరొక ప్రక్క శతాధికంగా గ్రంథాలను వ్రాయడం వారికే చెల్లింది. వారు తెలుగులోను, సంస్కృతంలోను గ్రంథాలను వెలయించారు దేవీభాగవత పురాణము, బుద్ధచరిత్ర, శ్రీనివాస విలాసము, శ్రవణానందము పాణిగృహీత వంటి ప్రబంధాలు, ముద్రారాక్షసం, మృచ్ఛకటిక మున్నగు నాటకానువాదాలు, పాండవోద్యోగము, పాండవ విజయము మున్నగు భారత నాటకాలు, గీరతము, గుంటూరు సీమ మున్నగు వివాద గ్రంథాలు, జాతక చర్య, నానారాజ సందర్శనం, శతావధానసారం మున్నగు గ్రంథాల నెన్నిటినో పేర్కొనవచ్చును.

## కవితా స్వరూపం :

'ఒక చరణం బతండు' మఱి యొక్కటి నేను మఱొక్కటాతడున్' అన్న నియమంతో అవధానాలలో కవిత చెప్పి 'ఒక్కరు రచియించి రేనియును కాదగు తిర్పతి వేంకటీయమై' అన్న నియమంతో చివరి వరకు వారు రచనలు గావించారు. ఒక్కొకచోట నొక్కొకని వద్ద నొకొక్క మాట చొప్పునన్' చాతురి మీరగ చెప్పు ప్రజ్ఞ సంపాదించారు. కాని 'కవుల మిప్పటి రూల్సుకు కట్టుబడమనీ....' 'అనుభవించితిమి దివ్యభోగము లను రాజాధిరాజులకన్న అధికముగా నని నిరంకుశ ప్రతిభతో విలసిల్లిన కవితల్లజులు వారు'. 'కాలము బట్టి దేశమునుగాంచి, ప్రభుత్వమునెంచి దేశభాష లలితాంగి మారుటది సత్కవి సమ్మతమ'ని వారు రసవత్తర శృంగార కావ్యాలు—శ్రవణానందము, పాణిగృహీత వ్రాశారు. వారి కవిత్వంలో యమకము; అర్థ గౌరవము, పేశలమైనశైలి, పొంకము కలిగిన పదబంధము, రసపుష్టి సౌష్ఠవము, కల్పనా చాతురి, వ్యంగ్యవైభవము అధికంగా ఉండడం వల్ల కవులు, పండితులు, ఆబాలగోపాలం వారి కవితా ప్రభావానికి లోనయ్యారు. ప్రభువులా నాడు వారి కవితను పల్లకీ నెక్కించారు. వారి శైలీ

ప్రభావానికి లోనైన సాహితీ రస సింధువులు వారి చాటువులు, ప్రబంధాలలోని పద్యాలు, భారత నాటకాలలోని పద్యాలు పారాయణం చేశారు.

వారికవితా ప్రభావం, శైలీ ప్రభావం ఇంతింతనరానివి.

'ముద్దు ముద్దుగఁ జెప్పఁబూనితిమా, వన్నె
లాడి తీయని మోవి లంచమిచ్చుఁ
గఠినమ్ముగాఁ జెప్పఁ గడఁగితిమా, ప్రౌఢ
కాంత వక్షోజముల్ కాన్కలొసగుఁ
దీక్ష రీతినిఁ జెప్పఁ దెరకొంటిమా, వాలు
గంటి వేఁ జూపు సుంకమ్ము సంగు
మిశ్ర రీతినిఁ జెప్ప మే కొంటిమా, బోటి
బిగువు కౌఁగిలి పన్ను బెట్టి తీఱు
నాశుధారా కవిత్వమ్ము నందుకొంటి
మేని యభిసారికయు దండమిచ్చి తీఱు
ఆంధ్ర గీర్వాణ భాషల యందు మాకు'
....................................

అని తమ కవితా ప్రాభవాన్ని గద్వాల రాజా ఎదుట వెల్లడించారు.

శతఘంట కవనమ్ము సల్పు సంగతి యన్న
గరతలా మలకమ్ము గాదె మాకు
అష్టావధాన కష్టా వలంబన మన్న
'నంబి కొండయ దండనంబు' మాకు
ఆశుధారా కవిత్వాడంబరం బన్న
'నల్లేరుపై బండి నడక' మాకు
సత్కావ్య నిర్మాణ చాక చక్యంబన్న
'షడ్రసోపేత భోజనము' మాకు
వ్యర్థమగు వాదము లొనర్చునట్టి వారి
'డంబమణఁగించు టా పోశనంబు'మాకు

అని వారి ప్రతిభా విశేషాలను వివరించారు.

వారు మీసాలను పెంచారు కవులు కదా మీరు ఎందుకయా మీసాలను పెంచారంటే.

"దోసమటం చెఱింగియును దుందుడు
కొప్పఁగఁ బెంచినార మీ మీసము 'రెండు భాషలకు
మేమె కవీంద్రుల' మంచుఁదెల్పగా రోసము గల్గినన్
గవి వరుల్ మము గెల్వుఁడు, గెల్తురేని యీ
మీసము దీసి మీ పద సమీపములన్ దలలుంచి
మ్రొక్కమే" అని సవాలు చేశారు

ఒక సంస్థానంతో ప్రభువుల వారిపై పద్యాన్ని చెప్పడానికి ప్రారంభిస్తే శబ్దార్థాలు వచ్చి వారి మీద పడుతున్నాయట!

శ్రీ నాప్పారెడి సీదు వర్ణనకునై చేయూప
శబ్దార్థముల్
నేనేవచ్చెద నేనె వచ్చెదను నేనేవత్తు నేవత్తు
నేనేనే యని వచ్చి మీఁదఁబడు మే మెద్దానిఁ
గైకొందు మె
ద్దానిన్ పీడుదు మోయి చిన్ననృపతీ! దాన
ప్రధానాకృతీ!'

ఇటువంటి పద్యశైలీ ప్రభానికి లోను కాని వారెవ్వరుంటారు.

## శ్రవణానందం మాధుర్యం :

తిరుపతి వేంకట కవులు వ్రాసిన కావ్యాలు చాలా ఉన్నా వారి శ్రవణానంద కావ్యానికి వచ్చిన ప్రాచుర్యం మరొక కావ్యానికి రాలేదు. ఆ కావ్యాన్ని చదివి పొంగి పోయిన ఒక కవి.—

'ఒక శ్రవణానందమ్మున
నొక పద్యము నందుఁ గలుగు నొక
పాదమునం

దాక యక్కరమున కిచ్చిన
సకలంబగు రత్న గర్భ చాలునె తూపన్'

అని అతిశయోక్తితో పలికారు. శ్రవణానందంలోని పద్యాలు ఒక్కొక్కటి ఒక్కొక్క రసగుళిక అని చెప్పాలి. ఆ రోజుల్లో 'మనమా! వద్దిక నాదు మాట వినుమా మర్యాదఁగా పాడుమా!' అన్న మకుటంతో ఉన్న పద్యాలు శతకంలో ఉన్న పద్యాలుగా పారాయణం చేసేవారు.

'ధనమా పోవును మానమా చెడును, నిందా
నెత్తిపై కెక్కు, లో
ననుమానింతురు తల్లిదండ్రులు, కులంబా
వన్నెకుందక్కు, నూ
తన మాంద్యమ్ము ఘటిల్లు,బందుగులు పంతం
బొప్ప నిందింతురు
మనమా! వద్దిక నాదు మాట వినుమా!
మర్యాదఁ గాపాడుమా'.

అన్న పద్యం ఈ నాటికీ సభలలో వింటూనే ఉంటాము.

## నాటకములలోని శైలీ మాధుర్యం :

తిరుపతి వేంకట కవుల భారత నాటకాలలోని పద్యాలు అందునా విశేషించి పాండవోద్యోగం, పాండవ విజయం నాటకాలలోని పద్యాలు నిత్య జీవితంలో మనము మాట్లాడుకొనేటట్లు 'బావా! యెప్పుడు వచ్చితీవు సుఖులే భ్రాతల్ సుతుల్ చుట్టముల్'అనీ 'ఎక్కడ నుండిరాక యిటు? ఎల్లరునున్ సుఖులే కదా!' 'అదిగో ద్వారక ఆలమందలవిగో' అని పండిత పామరులంతా కమ్మగా పాడతారు.

గ్రామాలలో పొలాలలో పనిచేసే పాలికాపులు సహితం రాయబార ఘట్టంలో కృష్ణుడు చదివిన పద్యాలు ప్రతి ఒక్కరు కూని రాగంతో— 'చెల్లియొ చెల్లకో తమకు చేసిన యెగ్గులు సైచిరందరున్' అనియో 'అలుగుటయే యెరుంగని మహా మహితాత్ము డజాత శత్రువే అలిగిననాడు' అనియో 'సంతోషంబున సంధి చేయుదురే....'అనో లేదా

"జెండాపైఁ గపిరాజు ముందు సితవాజి
శ్రేణియుం గూర్చి నే
దండంబుంగొని తోలు స్యందనము మీద
న్నారి సారించుచున్
గాండీవమ్ము ధరించి ఫల్గుణుడు మూకం
జెండుచున్నప్పుడు యొ
క్కండు న్నీ మొఱ నాలకింపరు కురుక్ష్మానాథ
సంధింపగన్'

అని పరవశంతో పాడతారు.

ఈ విధంగా ఆంధ్ర సాహిత్య రసిక జనాన్ని తమ కవితాంబుధిలో ముంచెత్తిన తిరుపతి వేంకట కవులు నిజంగా కారణజన్ములే. చివరిగా వారి పద్యంతో వారికి నివాళు లర్పిస్తాను

'ఏనుగు నెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కగ
నిక్కినాము స
న్మానము లందినాము బహుమానములం
గ్రహియించినార మె
వ్వానిని లెక్కపెట్ట కనివారణ దిగ్విజయం
బొనర్చి ప్ర
జ్ఞానిధులంచుఁ బేరు గనినారము నీవలనన్
సరస్వతీ!'

# తిలక్ కథానికా శిల్ప పారమ్యత

దోనేపూడి రమేష్‌బాబు

తెలుగు సాహిత్యంలో కవులు, కథకులు, విమర్శకులు, పండితులు.... ఈ రకంగా అనేకులు ఎవరి మార్గంలో వారు ప్రసిద్ధులై ఉన్నారు. కానీ కవి పండితులు, విమర్శక కవులు, కవి కథకులు మొదలైన మిశ్రమ రీతిని సంపూర్ణంగా సాధించిన వారు అరుదు. పై అన్ని రంగాల్లో కాకపోయినా కథల్లో కవిత్వాన్ని, అందులో అనుభూతిని, ఆర్ద్రతను రంగరించి నవ్యతను సాధించిన వారిలో తిలక్ ప్రథముడు. ఈ రకమైన కథన పద్ధతి 'న భూ తః; న భ వి ష్య తి' జీవితాన్ని సమగ్రంగా దర్శించి, దాన్ని తనదైన శైలిలో చెప్పి హృదయాన్ని కదలించడం తిలక్ ప్రత్యేకత. వ్యక్తిత్వం ఉన్న ఏ కవికైనా, కథకుడికైనా తనకంటూ ఒక శైలి, శిల్పం ఉంటుంది. అది ఆ రచయిత రచనలో వద్దన్నా కనిపిస్తూనే ఉంటుంది. ఈ రకంగా రచనలో కనిపించే కవి యొక్క శైలినే 'ఆత్మీయతాముద్ర' అని కూడా అనవచ్చు.

శిల్పాన్ని గురించి ఒక్కొక్కరిది ఒక్కో దృక్పథం. దృక్పథాన్ని బట్టి వారు వివిధ రకాలైన నిర్వచనాలిచ్చారు. ఉదాహరణకు 'శిల్పం' ఆనందం కొరకేనని గాని, 'శిల్పం' పరమార్థమని గాని బుద్ధిగల అభ్యుదయ రచయిత ఎవరూ అనరు 'వస్తువు నందు ప్రేక్షకులకూ, శ్రోతలకూ, పఠితలకూ అత్యంతమైన ఆసక్తి జనింపజేయడమే, వస్తువును రసాత్మకం చేయడమే శిల్పం యొక్క ఆశయం'[1] అనేది కొడవటిగంటి కుటుంబరావు గారి నిర్వచనం. ఇలాంటివి పాత్రలను, వర్ణనలను, వస్తువును, స్వభావచిత్రణను మొదలైన వాటిని ఆధారంగా చేసికొని వచ్చినవి. ఇవి వేటికవే సమగ్రంగా భాసిస్తాయి. కానీ 'నిర్వచనం' అన్నది సార్వకాలికం కాకపోయినా సార్వజనీనంగా ఉండాలి. 'శిల్ప' నిర్వచనాన్ని గురించి చెప్పాలంటే శిల్ప మనేది రచనకు సంబంధించినది కాబట్టి నిర్వచనమంటూ చెప్పదలిస్తే రచనా పరంగానే చెప్పాలి. రచయిత స్వీకరించిన వస్తువేదైనా తన రచనా వైశిష్ట్యంతో దాన్ని పాఠకుడికి ఆస్వాదనీయయోగ్యంగా చెయ్యవచ్చు. కాబట్టి 'అనవసరమైన దాన్ని బహిష్కరించి, చెప్పదల్చుకున్నదాన్ని భంగ్యంతరంగా, సుందరంగా చెబుతూ తద్వారా పాఠకుడి చేత వస్తువును స్వీకరింపజేసి అనుభవింప గలిగేలా చెయ్యడం' కంటే మించిన శిల్పం లేదని చెప్పవచ్చు. ఇది రచనలో భాగమైన పాత్రచిత్రణ ద్వారాగానీ,

---

1. కొడవటిగంటి కుటుంబరాజు. సాహిత్యంలో విప్లవోద్యమం. పేజీ-66.

శేరిలింగంపల్లి, హైదరాబాదు-500133.

వర్ణన వల్లగానీ ఇంకా ఏ ఇతర అంశం వల్లనైనా గానీ సాధించవచ్చు. ఒక్కొక్క రచయిత ఒకొక్క రకమైన శిల్పానికి వారసుడు కావచ్చు. ఒకే రచయిత విభిన్న అంశాలద్వారా శిల్పాన్ని సాధించవచ్చు. తిలక్‌ది రెండోమార్గమని చెప్పాలి.

ఆధునికుల్లో కొందరు విమర్శకులు టెక్నిక్, శిల్పం అనే పదాల్ని పర్యాయపదాలుగా వాడుతున్నారు. 'టెక్నిక్'ని తెలుగులో 'సంవిధానం' అని వ్యవహరిస్తున్నాం. దీని అర్థాలు ఇవి.

1. సంవిధానం (Technique) వ్యాకరణ ఛందస్సులే కాక తదతీతమయిన ఒక విపుల వ్యవస్థ. కవి తనలో అంతర్గతమయిన రసాన్ని పాఠకునిలో బహిర్గతం చేయగలుగుతున్న కార్యమే సంవిధానం
2. కేవలం ముడిపదార్థమైన వస్తువును భాష, ఛందస్సు, రసభావం, భావన, ప్రక్రియ వంటి పరికరాలతో రూపవంతంగా, సజీవంగా మలిచే విధానమే సంవిధానం **(Technique)**
3. అనుకూలమగు శబ్దములను, మాత్రాపరిమితిని గణనియమములను బాటించునది కల్పన పద్ధతి లేక టెక్నిక్ అనబడుచున్నది.

పై నిర్వచనాల బట్టి, అర్థాలబట్టి పరిశీలిస్తే శిల్పానికున్నంత పరిపూర్ణత్వం టెక్నిక్‌కి లేదని పిస్తుంది. రచయిత చెప్పదల్చుకున్నది పాఠకుడికి ప్రత్యక్షం కావడం కోసం రచయిత ఏమిచేసినా శిల్పమే అవుతుంది.

తిలక్ కథలను పరిశీలిస్తే తను చెప్పదల్చుకున్నదాన్ని బహుముఖాలుగా అభివ్యక్తీకరించాడని తెలుస్తుంది. కానీ ప్రధాన సాధనాలుగా ఎన్నుకున్నవి మూడు. అవి 1) వాస్తవికత, 2) కవిత్వమయ వ్యక్తీకరణ, 3) మనస్తత్వ చిత్రణ.

పై మూడింటిలో తిలక్ సాధించిన శిల్పాన్ని ఆవిష్కరింప జేయాలన్న యత్నం ఈ వ్యాసం.

తిలక్ కథల్లో ప్రధానంగా కనిపించేది వాస్తవికత. వాస్తవికత అనేది వస్తువులో భాగమే తప్ప రచనలో ఒక అంశమా? అన్న అనుమానం రావచ్చు. ఇది వస్తువులో భాగమైనా దీన్ని ప్రదర్శింప జేయడంలో ప్రధాన భూమిక వహించేది రచనే. 'శిల్పం వాస్తవికతకి అతీతమైనది అని వాదించి ప్రయోజనం లేదు'4 అన్న శ్రీశ్రీ మాటలు శిల్ప నిర్వహణలో వాస్తవికతకున్న ప్రాధాన్యాన్ని వ్యక్త పరుస్తున్నాయి. నిజంగా జీవితాన్ని అంతర్నేత్రం ద్వారా దర్శించిన కవి జీవితాన్నుంచి పారిపోయి ఊహాలోకాల్లో విహరించడు. తను దర్శించిన జీవితంలోని కష్టాలను, బాధలను, విద్వేషాలను, పగలను, ఈర్ష్యాసూయలను తన సాహిత్యంలో ప్రతిఫలింపజేసి వాటికో పరిష్కార మార్గాన్ని సూచించడానికి ప్రయత్నం చేస్తాడు. ఎన్ని పరిష్కారాలు కథల్లో ఉన్నా నిజ జీవితంలో అసలైన పరిష్కారం ధనం. కాబట్టి దీన్ని ప్రతిఫలింప జెయ్యడం కోసం యత్నిస్తాడు తిలక్. ఈ దృష్టితో చూస్తే 'ధనమూల మిదం జగత్' అన్న సూక్తి సత్యమని తెలుస్తుంది. దారిద్ర్యం, ఆకలి, నిరుద్యోగం' బానిసత్వం—వీటన్నిటికి

1. శ్రీ శ్రీ మన గురజాడ 'ముత్యాలసరం ఒక కృషి' పేజీ-28.
2. మిరియాల రామకృష్ణ "శ్రీ శ్రీ కవిత్వం-వస్తువు సంవిధానం పేజీ-684.
3. పురాణం సూరిశాస్త్రి, విమర్శక పారిజాతము.
4. శ్రీ శ్రీ మనగురజాడ, 'గురజాడ ఆధిక్యానికి కారణాలు" పేజీ-58.

మూలం ధనమే. ప్రేమ, వాత్సల్యం, ఆప్యాయత, అనురాగం అన్నీ పరిభ్రమించేది ధనం చుట్టూనే అంటే అవాస్తవికంగా కఠినంగా తోచవచ్చు. కానీ ఇది సత్యం, వాస్తవం.

ఆకలి కడుపులో సుళ్ళు తిరుగుతుంటే తన కుటుంబమే తనకు అసహ్యించుకుంటే జీవితాన్ని పరిత్యజిద్దామను కుంటాడు 'ఆశాకిరణం'లో వెంకటేశ్వర్లు. కాని ఆ ఆకలి నివారణార్థమే తన కన్నకూతురు వ్యభిచరించడంతో సమాజంలో నైతిక విలువలు అంటూ ఏమీ లేవని, బ్రతకడమే ముఖ్యమనే నిర్ణయానికి వచ్చి, ఆమె సంపాదన మీదే జీవించడానికి పూనుకుంటాడు. ఈ కథలో అవాస్తవికతకి చోటులేదా? అంటే 'లేడీ ఇన్స్పెక్టర్' కొంగు పట్టుకొని వెంకటేశ్వర్లు లాగడం జరగని వని అని కొందరంటారు. కానీ ఒక విచిత్ర మానసిక స్థితిలో ఏమి చేస్తున్నామో ఎవరికీ తెలియదు. అప్పటి వరకు నవ్వుతూ, తుళ్ళుతూ ప్రవర్తించిన అధికారిణి ఒక్కసారిగా ఉగ్రురాలయ్యే సరికి 'షాక్' తిన్న వెంకటేశ్వర్లు అలా ప్రవర్తించ డంలో అవాస్తవికత ఏమీలేదు. అలాగే 'తీవ్రవాద నాయకుడి'లో శేషయ్యకు అక్క, తల్లి ఉన్నారు. ఇతని సంపాదనాచాతుర్యానికి తట్టుకోలేని తల్లి పరలోకానికి చప్పుడు చెయ్యకుండా ప్రయాణం చేస్తే అక్కగారు పక్కవాడితో చక్కగా లేచి పోతుంది. అప్పుడు శేషయ్య బాధ వర్ణనాతీతం. తల్లి పోయినందుకు, అక్క లేచిపోయినందుకు కాదు; తనూ ఆడది కాలేక పోయినందుకు. 'ఆడ దైతే ఎవడో ఒకడు తనను కూడా లేవదీసుకు పోను గదా!' అన్నది శేషయ్య ఆలోచన. దీన్ని బట్టి సంఘంలో నైతిక విలువలకు ఆకలి,దారిద్ర్యం ముందర ఎంత స్థానం ఉందో ఆలోచించవచ్చు.

వాస్తవికత పేరుతో లేని దాన్ని ఉన్నట్లుగా గోరంతలు కొండంతలు చేసి చెప్పే వర్గం ఒక టుంది. కాని తను పొందిన అనుభూతిని, చూచిన దృశ్యాలను పాఠకుల చేత తను పొందినట్లుగానే అనుభవింపజేయ గలగడం వాస్తవికత. ఇది సమాజాన్ని క్షుణ్ణంగా పరిశీలించి సమాజ జీవితాన్ని ప్రతిఫలింప జేయగలిగిన 'నమూనా' (Type) పాత్రలను సృష్టించడం ద్వారా సాధింప వచ్చు. ఈ దృష్టితో చూస్తే తిలక్ పూర్తిగా కృతకృత్యు లయ్యారని తెలుస్తుంది. తిలక్ రచనల్లో అభూత కల్పనలుగాని, అస్తవ్యస్తపు టాలోచనలు గాని, అసంబద్ధమైన ఆడంబరత్వంగాని మచ్చుకైనా గోచరం కావు.

మధ్యతరగతి యువతీ యువకుల పగటి కలలకు, వారి ఊహాప్రపంచానికి, అందని దానికి అర్రులుచాచి వారు పొందే వ్యధకు దర్పణం 'సుందరి-సుబ్బారావు'. మధ్యతరగతి వర్గానికి ప్రతినిధియై అక్కడి 'గొప్పలు, ముళ్ళు, డొంకలు, రాళ్ళు, గాజుపెంకులు, గోతులు, తేలుకాట్లు, ఇంద్ర గబ్బులు అడుగడుగునా మలుపు మలుపునా తగు లున్నా' తన అందంవల్ల అదృష్టమనేది వస్తుందని జీవితాన్ని సాగదీసే ఆశాజీవి సుబ్బారావు. కాకతాళీయంగా సుమిత్ర కారు ఢీ కొట్టడంతో వీరిద్దరికి స్నేహంలాంటిది ప్రబలుతుంది. గొప్ప కుటుంబాల్లో ఈ కలుపుగోలు తనం మామూలే నని తెలియని అమాయకపు సుబ్బారావు తనకే తెలీని ఊహాలోకాల్లో విహరిస్తుంటాడు. అక్కణ్ణుంచి సుమిత్ర ఇచ్చిన 'శుభలేఖ'దబ్బున కిందకుపడేసి వాస్తవ ప్రపంచాన్ని కళ్ళగ్గట్టినట్లు చూపిస్తుంది. కేవలం ఇదేగాక 'సెకండరీ గ్రేడు మేస్టరువి సుబ్బారావూ! నీకిచ్చి నాన్న ఎలా పెళ్ళి చేస్తాడను కున్నావు?' అన్న సుమిత్ర వాక్యాలు సుబ్బారావుని

మళ్ళీ జాలిగా తల్లిలాగా చుట్టుముట్టి 'చీకటి'లోనికి తీసుకెళ్తాయి. ఈ మధ్యతరగతి చీకటికి వెలుగురేఖ లుండవనే వాస్తవాన్ని తెలుసుకోనంత వరకు సుబ్బారావు లాంటి అమాయకులు అలా భ్రమ పడుతూనే ఉంటారు. జీవితపు పందెంలో ప్రతి సారి ఓడిపోతూ దిగులు చెందే మనిషి 'ఓడిపోయిన మనిషి'. జీవితపు రహస్యం తెలియక కృత్రిమ సౌఖ్యాలకు లొంగిపోయి నిరంతర మానసిక సంఘర్షణతో ఇరవైలోనే అరవైవాడుగా మనిషి మారిపోవడం ఇందులో చిత్రితమైంది. యవ్వనంలో ప్రేమించిన బాలను ధనం లేదనే నెపంతో తిరస్కరిస్తాడు. 'కోపంతో ఎరుపెక్కిన నాన్న మొహం, నిరసనతో చూసే అమ్మ మొహం పద్దెనిమిది వేల కట్నంతో జడ్జిగారి సంబంధం, రాజకీయంగా వేసుకున్న ప్లానులు ....' వీటితో పోల్చుకుంటే 'బాల' ప్రేమ అల్పంగా కనిపిస్తుంది. పోనీ ఇవన్నీ సాధించి ఇపుడైనా సుఖపడుతున్నాడా? అంటే మెత్తగా, ముదురుగా లావుపాటి పాత రబ్బరులాగా ఉన్న భార్య కాసేపు కూడా కల్పనాసుఖాన్ని ఊహించుకోనివ్వని కఠినవాస్తవికతతో కనిపిస్తుంది.

వాస్తవాన్ని చిత్రీకరించడంలో కూడా ఒక నవ్యతను సాధించడం-'రాత్రి 9 గంటలకు' అనే కథలో చూడవచ్చు. రాత్రి 9 గంటలకు ఒక పట్టణ వాస్తవ పరిస్థితిని చెప్పడం, తద్వారా ఆధునిక జీవితం ఎంత క్లిష్టతను సంతరించుకుందో చెప్పడం ఈ కథ ఉద్దేశ్యం. నగరంలో 9 గంటలకు రోగులు, క్రౌర్యాన్ని దాచుకున్న కవులు, కాముకులు, ఆశావాదులు, వ్యభిచారులు, దీనులు, వేశ్యలు.... కలగలుపుగా, కలగాపులగంగా ఉన్న పట్టణం రంగు వేసుకున్న మొహం, రాకాసి వంటి అహం, మిలమిట్లు కొలిపే నవ్వుతో మెత్తగా కౌగిలించుకొని సగటు మనిషి అభిరుచిని వ్యక్తిత్వాన్ని మంట గలిపి అమాంతం కన్నుమూసేలా చేస్తుంది. ఈ రకంగా జీవితంలో ప్రతి మూలని స్పృశించి అన్ని రంగాలోనూ మానవుడి వైఫల్యాలను గుర్తింపజేసి అతడిని సక్రమ మార్గంలో పెట్టడానికి యత్నిస్తాయి తిలక్ కథలు. తిలక్ కథలు మోదాంతాలా? విషాదాంతాలా? పరిష్కారాన్ని బోధించాడా? పాఠకుడికే వదిలేశాడా? అనే అనుమానం కలిగించేవిగా ఉంటాయి. విషాదాంతమైనా పరిష్కారం మాత్రం తప్పక ఉంటుంది. కానీ వాచ్యంగా ఉండదు.

తిలక్ కథల్లో రెండవ అంశం కవిత్వం. కవి కథలు వ్రాస్తే వచ్చే విశిష్ట గుణం ఈ కథల్లో కనిపిస్తుంది. తిలక్ కథా రచయిత. అయినా మౌలికంగా కవి. ప్రపంచం ఇతన్ని కవిగా గుర్తించినంతగా కథకుడిగా గుర్తించలేదు. కవి కాబట్టే కథల్లో కూడా కవిత్వం వ్యక్తమౌతుంది. ఈ కథలోని వర్ణనల్లో గాని, వాతావరణ,మనస్తత్వ చిత్రణలో గాని కవిత్వ వాసన అధికంగా ఉంటుంది. కథా శీర్షికలో వైవిధ్యం గూడా గమనింప వచ్చు. 'గడియారపు గుండెలు', 'మీరేనా-నీవేనా', 'సముద్రపు అంచులు' మొదలైనవి ఉదాహరణలు అవుతాయి. కవిత్వాభివ్యక్తి అనేది ముఖ్యంగా వర్ణనల్లో కనిపిస్తుంది. కవిత్వీకరించి చెప్పడం అంటె ఆలంకారికంగా చెప్పడం అంటే ఉపమా రూపకాద్యలంకారాలతో చెప్పడం కాదు. ఆలంకారికంగా అంటే—అలంకరించి చెప్పడం. ఈ అలంకరణ దేనితోనైనా చెయ్యవచ్చు. కేవలం రూఢమయిన ఉపమాద్యలంకారాలతోనే ఉండాలన్న నియమంలేదు. ఈ రకమైన అభివ్యక్తి అధికంగా వర్ణనల్లో కనిపిస్తుందని చెప్పబడింది. ఈ వర్ణన వస్తుదీప్తికి కారకమౌతుందే తప్ప భంజకంకాదు. కొందరి రచనల్లో కథా వస్తువు, వర్ణన తిలతండుల న్యాయంగా ఉండగా మరి కొందరి రచనల్లో నీరక్షీర న్యాయంగా ఉంటాయి. తిలక్ రెండో వర్గంలోకి వస్తాడు.

పేదరికంలో ఉండే కష్టం 'చీకటి'లా ఉంటుందని చెబుతూ దానిలోని కష్టాన్ని అనుభూతిలోకి తేవడానికి ప్రయత్నిస్తూ 'చీకట్లోకి జారిపోతున్నట్టు' గా ఉంది అనిపిస్తాడు—'ఆశాకిరణం'లో వెంకటేశ్వర్లు చేత. అనేక కష్టాలు చుట్టుముట్టినపుడు చుట్టూ చీకటి చేరి ఉన్నట్లనిపించడం సహజమే. కానీ జారిపోవడం అనే పదం వాడటం వల్ల అతను నిస్సహాయుడనే భావం అవగతమౌతుంది. 'నీళ్లలో జారిపోవడ'మనే వాక్య సామ్యంతో 'చీకట్లో జారిపోవడం, చీకటి నీళ్లలో పీకలోతు మునిగిపోవడం' అనేవి వాడటం వల్ల నీళ్లలో మునిగిపోతే ఉండే ఊపిరాడని తనం, ఉక్కిరి బిక్కిరి తనం మొదలైనవన్నీ ఈ ఒక్క 'చీకటి నీళ్లు' అనే పదం ద్వారా తెలియజేస్తున్నాడు. అతనికి నిస్పృహలాంటి, మూర్ఛలాంటి నిద్రపట్టిందని చెప్పడం వల్ల అతనికి పట్టింది నిద్రకాదని, నిద్ర ఆహారం లేనందువల్ల వచ్చిన శోష అని తెలుస్తుంది. వెంకటేశ్వర్లు ఉద్యోగం 'అధికారిణి పైటకన్నా బహిరంగంగా, అంతకన్నా శాశ్వతంగా' పోతుంది. అనుకోని పరిస్థితుల్లో వెంకటేశ్వర్లు కొంగుపట్టి లాగడం వల్ల ఆమె పైట వూడి పరువు బహిరంగమయింది. కానీ ఇది తాత్కాలికం. ఈ చర్యవల్ల ఆమెకు కల్గిన అవమానం తాత్కాలికం, క్షణికం. అధికార భయంవల్ల దాన్ని గురించి ప్రత్యక్షంగా కానీ పరోక్షంగా కానీ ఎవ్వరూ నోరెత్తరు. కానీ ఈ పని చేసిన వాడి ఉద్యోగం శాశ్వతంగా ఊడిపోతుంది. తద్వారా వచ్చే అవమానాలు, అవహేళనలు కూడా శాశ్వతమే.

అలాగే గాలి దిగులు దిగులుగా ఉందని చెప్పడం, గారపట్టిన పళ్లలోంచి పొడుచుకు వచ్చిన నవ్వులో ఎండుటాకుల్ని కాల్చివేసే నిర్దయత్వం ఉందని చెప్పడం. మూడేళ్ళ కాలం వెధవ కలలు వచ్చిన పెద్ద నిద్రలా నడిచిందని చెప్పడం, వెన్నెల శవం మీద కప్పిన తెల్ల బట్టలా ఉందనడం, విధి నల్లని పెదవులు వారి జీవితాన్ని ముద్దెట్టుకున్నాయని చెప్పడం వంటివి తిలక్ కవిత్వాభివ్యక్తిని వ్యక్తపరుస్తున్నాయి.

మనస్తత్వచిత్రణలో తిలక్ది అందవేసిన చెయ్యి. భర్త ఇంట్లో లేక, కోరికలతో వేగిపోతున్న నిగ్రహంలేని యవ్వనంలో వున్న స్త్రీ మనస్తత్వానికి ప్రతిబింబం 'యవ్వనం'. భర్తకు అన్యాయం చెయ్యగూడదని అంతరాత్మ ఘోషిస్తూనే ఉంటుంది. కానీ ఇంద్రియాలు అలవి తప్పి ప్రవర్తిస్తుంటాయి. ఈ రకమైన సంఘర్షణలో నలిగిపోయి శరీరాన్ని జయించలేక, ఆత్మను వంచించ లేక మరణానికి పాల్పడుతుందా స్త్రీ. కానీ అదే రకమైన తప్పు గతంలో భర్త కూడా చేశాడని, అదే తప్పు తను చేస్తే క్షమించలేక పోయాడని చెబుతుంది. మానవుడి మనసులోని బలహీనతలకి యవ్వనం ప్రతీక.

మనిషికి మార్పు సహజం. ఇది శారీరకంగాను, అంతరంగికంగాను. శారీరకంగా యవ్వనం అనంతరం వచ్చే వృద్ధాప్యాన్ని గురించి అతిగా ఆలోచించి రేపురాబోయే దాన్ని ఇప్పుడే అనుభవించడం 'పలితకేశం'లో ప్రసాదరావు లక్షణం. వృత్తిగా దొంగతనాన్ని ఎన్నుకున్నా ప్రవృత్తి మానవత్వం 'దొంగ' లోని గోపాలంది. దొంగతనానికి ఒక ఇంటికి వస్తాడు గోపాలం. కానీ ఆ ఇంట్లో భర్త జూదంకోసం భార్య నగలివ్వనందే చిత్రహింసలు పెట్టడం చూసి మనిషిగా మారి భర్తకు బుద్ధిచెప్పి బయటకు వస్తాడు. దొంగగా బయలు దేరి దొరగా బయటకు రావడం అసహజం కాదు. ఈ రకంగా దొంగల్లో మనుషులు, మనుషుల్లో దొంగలు ఉంటారని చెబుతుందా కథ. 'అతి సర్వత్ర వర్జయేత్' అనే సూక్తికి వివరణలా ఉంటుంది సీతాపతి కథ. భార్య అతిప్రేమ అతన్ని ఇంట్లోంచి వెళ్ళిపోయేలా చేస్తుంది.

మనస్తత్వ చిత్రీకరణలో తిలక్ 'పరివర్తన' ఆణిముత్యం లాంటిది. శంకరం,రాజేశ్వరి ప్రేమించుకుంటారు. రాజేశ్వరి బుద్ధిపూర్వకంగా నారాయణ రావును వివాహం చేసుకుంటుంది. వివాహానంతరం చాలా కాలానికి రాజీని కలుసుకున్న శంకరం రాజీని అనుభవించాలనుకుంటాడు. మొదట తిరస్కరించినా తర్వాత ఆహ్వానిస్తుంది రాజీ. రాజేశ్వరి ఇంటికి వచ్చిన శంకరం ఆ ఇంటితోను ఆమె భర్తతోను, పిల్లలతోను రాజేశ్వరికి ఉన్న గాఢమైన అనుబంధాన్ని చూసి, దాంపత్యంలో ఉండే పవిత్రతను గుర్తించి తన నీచమైన కోర్కెకు స్వస్తి చెప్పి నిష్క్రమిస్తాడు. ఇదే 'పరివర్తన'. ఈ కథలో శంకరం పాత్రలో వచ్చిన పరిణామ దశను చిత్రించడంలో రచయిత నాన్యతోముఖమైన ప్రతిభను ప్రదర్శించారు. మొదట్లో రాజీ శారీరక అందాల్ని వాంఛించిన శంకరం చివర్లో 'నిన్ను విడిగా ప్రత్యేకంగా నేను పొందడానికి నీ దగ్గర ఏమీలేదు రాజీ! మీ ఇద్దర్నీ విడదీసి చూడటం తెలివి తక్కువ. నిర్మలమైన ఒక సరస్సును కెలికి వేసేటంతటి కుసంస్కారిని కాదు నేను'—అని ఆలోచించే వరకు ఎదుగుతాడు. శారీరకాకర్షణకన్న ప్రేమానుబంధాలు ఆప్యాయతలు, అనురాగాలు ఎలా మనిషిని పెన వేసుకుని ఉంటాయో అద్భుతంగా చిత్రీకరించే కథ 'పరివర్తన'.

ఇవేగాక విభిన్న అంశాలలో తన శిల్ప నైపుణ్యాన్ని ప్రదర్శించారు తిలక్. డైరీని కథగా మల్చడం (హోటల్లో : ఏడురోజుల దినచర్య) మొదలైనవి ఇందుకు ఉదాహరణ లవుతాయి.

'కవుల రైలు' కథ కాదని ఇనాక్ గారన్నారు.[1] కానీ నేటి కాలంలో కవి బ్రువులు తప్ప కవులు లేరని, కవితా కన్యకు కవిత్వం (రైలు)లో చోటు లేక వెనక్కి తిరిగి జాలిగా వెళ్లిపోవాల్సి వచ్చిన అగత్యం వచ్చిందని చెబుతుందా కథ. ఇది ఎందుకు కథ కాలేకపోయిందో ఇనాక్ గారు చెబితే బాగుండేది.

ఇంకా ముగింపులో ఎత్తుగడలో, పాత్ర చిత్రణలో, సౌకుమార్యంలో, శైలిలో ప్రతిచోటా శిల్ప సౌందర్యం వెల్లివిరుస్తూనే ఉంటుంది. 'అవ్యక్తమైన అనుభూతి కవి పొందగానే దానిని పదాల ద్వారా తెలియజేస్తాడు. ఆ పదాల అర్థం ద్వారా కవి తాను పొందిన అనుభూతిని ఇతరులలో కలిగించాలి. అందుకే కవి చేయవలసినది ప్రకటన (expression) కాదు. అనుభవాన్ని తెలియజేయడం (communication) అవుతుంది'[2] అన్న తిలక్ మాటలకు ఆచరణ రూపాలీ కథలు. సంక్షిప్తత, ఏకాగ్రత, సమగ్రత, నిర్భరత తిలక్ కథానికకు లక్షణాలు.

చివరగా ఒకమాట. "వస్తుతః తిలక్ రచయిత కాదు కానీ, అతని కథలు అధికంగా లేవు. గురజాడ అప్పారావూ కథా రచయిత కాదు. కానీ అతని కథలు అధికంగా లేవు. అయితే వాళ్ళిద్దరూ వ్రాసిన కథలు దాదాపు అన్నీ ఆణిముత్యాలు. మరో అడుగు ముందుకు వేసి చెబితే అప్పారావు కథానికా, కథా రచనలోనూ ఆద్యుడే అయినా ఆద్యుడి కథల కంటే తిలక్ కథలు తీసిపోవు'[3].

1. సమీక్షణం—కొలకలూరి ఇనాక్.
2. 'కావ్యసృష్టి'—(వ్యాసం) బాలగంగాధర తిలక్, భారతి 1944 జూన్.
3. సమీక్షణం—కొలకలూరి ఇనాక్.

# కవితా వీథి

## పంచవ

మూలం: మైథిలీ శరణ్ గుప్త

అనువాదం: ఈమని దయానంద

పరవనితను తొలుత నేను
పలుకరించి యుందునేని
పురుషజాతి కళంకమును
పొందకుందునే రమణీ'

నన్ను గూర్చి నీ ఊహలు
నగ్నసత్య మనుకొందును
నీ యెడ నాకెట్టి మమత
నిక్కముగా లేదందును

కన్న తల్లి దండ్రులపై
కట్టుకొన్న కులసతిపై
మమతలేదు సంపదపై
మధు జీవన పాత్రముపై

ఇన్ని మాట లేటికి నే
నున్నానిట సౌఖ్యముగా
మహిళలందె గోచరించు
మమకార మ్మధికముగా

శూరవీర వరుడ వనుచు
భీరువుగా మలచినావు
నీ యందలి సూక్ష్మబుద్ధి
నిశ్చయముగ తెలిపినావు

మనుజకాంత వీవనుటకు
కనుపించదు సహజలజ్జ
దనుజకాంత వనుకొన నీ
తనువుజూడ పూలసెజ్జ.

వనదేవత వని తలవగ
కనరాదా నైర్మల్యము
నీ వెవరో తెలుప రాదె?
నివ్వెరపడె నాదు మనము.

అబల యిట్లు పలుకసాగె
అడిగితి వీ వెవ్వరనుచు
అయ్యయ్యో కఠినహృదయ!
అడుగ వేమి కోరెదనుచు,

మోసపోదు నేమొ మొట్ట
మొదటిసారి నీ ముందర
ఏమైనను వచ్చితి ని
న్నెట్లు విడుతు మనోహరా!

అతిథిగ భావించి కొంచె
మాతిథ్య మ్మొసగెదవా?
జాలిమాలి నీ విట్లే
కాలమ్మును గడపెదవా?'

తూరుపాలెం, ఒంగోలు

# శ్వేతపుష్పం

గుంటూరు శేషేంద్ర శర్మ

ఇవాళ తెగపాడుతోందేమిటో—తోటలో ఆ పక్షి
పిచ్చిపట్టిందేమో దానికి
ఆపాద మస్తకమూ పూచిన ఆ శ్వేతపుష్ప వృక్షాన్ని చూచి....
వసంత ఋతువంటే చెట్టులో నుంచి
విరుచుకుపడ్డ విశ్వరూపం కాబోలు
పశు పక్షి వృక్షాదులు వాటి శరీర శోభను
వీరావేశంతో వెదజల్లుతున్నాయి దశదిశలా—
ఈ ఋతువులో సింహాసనం మీద ఉన్న రాజుకంటే
కొమ్మమీద కూర్చొని ఉన్న కోకిలే మన ప్రభువు
ఇప్పుడు కోకిలపాడే ప్రతిపాటలో నుంచీ
గుంపులు గుంపులుగా దేవతలు దూకుతున్నారు!
కోకిల తోలుకొచ్చిన మిలియన్ల మిలియన్ల పూల మందలు
కొమ్మల నిండా విడిచి చేస్తున్న నృత్యాలు వందలు వందలు
ఒక్క పువ్వు చాలు ఉన్న స్మృతులన్నీ రద్దు చెయ్యడానికి
శోకాన్ని మరచి లోకాన్ని మరచి పోవడానికి—
తిథి వార నక్షత్రాలు పరివారంగా వస్తున్న
కాలం మనల్ని కరుణించి ఇస్తోంది ఈ మహాసౌందర్య దర్శనం—
కాలం చెట్లలో పూలు పూస్తుంది
శిథిలాల్లో సాలెగూళ్ళు నేస్తుంది
బూజు పట్టిన వస్తువుల్లో చరిత్ర నింపుతుంది!
సృష్టిస్తుంది యుగాల్ని నిర్మిస్తుంది సిద్ధాంతాల్ని
నిర్దాక్షిణ్యంగా వాటినే సంహరిస్తుంది
మళ్ళీ జలాల మీద పుష్పమై తేలుతోంది ఏమీ ఎరగనట్లు—
అనంత శూన్యంలో పరుగెత్తుతున్న ఈ మహాకాల వలయాన్ని
ఏ బాహువు ఆపలేదు!
రాలే ఆకు భూమిలో లీనమై పోతుంది; మళ్ళీ కోకిల గొంతు వినగానే
కొమ్మలో నుంచి నిద్రలేస్తుంది-ఆశ్చర్యం
దినం సాయంత్రం మరణించినా మరునాడు పునర్జన్మ ఎత్తుతుంది
కోడి ప్రభాతాన్ని తెస్తుంది మనకు
కోకిల వసంతాన్ని తెస్తుంది
మహాకాల మహిమల్ని గానంచేసే ఆ ఖగ మహర్షులకు
చేతులెత్తి నమస్కరిద్దాం....

# ప్రేమ తరంగాలు

మూలం
**పంచాక్షరి హిరేమఠ్**

అనువాదం
**శ్రీమతి జెమీమ సొలోమన్**

1

కట్టెదుట కన్పించేవన్నీ
నిజాలనుకుని అనుభవించాను అల్పానందంతో!
కాని—అవన్నీ ఒట్టి కలలే అన్పిస్తున్నాయి
ఈ దినం!

**2**

గులాబీకి రంగు, చుక్కలకు మిణుకు,
జీవితాని కో గమనం
నువ్వు లేకుంటే, అర్థమే లేదు వీటికి
నీ ప్రేమకై, మరింత ప్రేమకై వెర్రిగా
అర్రులు చాచే నాగుండె, పదే పదే కొట్టుకుంటూ
నిన్నే కోరుకుంటోంది!

3

అలసి, సొలసిన బాటసారినైన నాకు,
చల్లని నీడ నీవే!
అందుకే, నా ఊపిరి, నీ జ్ఞాపకాల
సువాసనలతో నిండిపోయింది.

4

ఈ మన ఎడబాటు ఓ దీర్ఘ రాత్రిలా వుంది!
అందుకే నిద్రరాక, అటూఇటూ దొర్లుతున్నాను.
నా ఒంటరితనంలోని విరహబాధ
ఎప్పటికైనా నీకు తెలుస్తుందా?

5

నా కన్నీటి గాథ నీకేమని చెప్పను
ఓ అనురాగమయీ!
ఇలాగే వుంటే ఈ కన్నీరే నిప్పయిపోతుంది.
ప్రవహించిందా, ఏరులై పారుతుంది.

6

నీ కౌగిలికై ఎన్నిసార్లయినా మరణించి
జన్మ జన్మలో నీ వాడిని గానే
వుండిపోవాలనే గాఢమైన కోరిక నాలో వుంది!

7

నీ ఊపిరినై, విశ్వాన్నంతటినీ
నీ పరిమళంతో నింపేయాలని
ఎంతో కోరికగా వుంది!

8

ఎండిన ఆకు గాలికి కదలినా, నీవేనేమోనని
అటూ ఇటూ ఆశగా చూస్తూ, ఆత్రంగా
నీ గుమ్మాన్ని చేరుకుంటాను నీ వుంటావనే
కొండంత ఆశతో
కానీ, నీవు లేవనగానే, నా నవనాడులూ కృంగి
అక్కడే కూలబడి పోతాను!

9

మహోన్నతమైన నీ ప్రేమలో జీవించాలనే
నేను జన్మించాను ఓ ప్రియ బాంధవీ!
నా జీవిత పరమార్థం నీ అందాల వెలుగుల్లోనే
వెదుకుతాను.

10

నేలనూ, నింగినీ కలిపేందుకు,
కళాకారుడు కట్టిన వారధి 'ప్రేమే' అని అర్థం
అయిందా యిప్పుడు?
అయితే ఇక ఆలస్యం దేనికి?
అప్పటి నీ కోపం అంతం అయితే ఆ వంతెన
మీదుగా రా!
వచ్చి, నా మనసూ, తనువూ నిండిపో!

'మృత్యుంజయ కృపా', జయానగర్, ధార్‌వాడ్—580 001, కర్నాటక.

# ఇవాళ నా హృదయం

-తిరునగరి

ఇవాళ
నా దేశం—
విషనాగులు తిరుగుతున్న ఉద్యానం
పందికొక్కులు తోడుతున్న ధాన్యాగారం
రాక్షసులు ధ్వంసం చేస్తున్న తపోవనం
నక్కలు ఊళలు వేస్తున్న అరణ్యం

ఇక్కడ

నా జనం-

నరాల్లో స్వార్థం
పుక్కిట్లో విద్వేషం
కడుపునిండా అవినీతి
గుండెనిండా బంధుప్రీతి

ఇప్పటి
నా జీవితం-

చతుశ్శతాబ్ది ఉత్సవాలు చేసుకోబోయే
కూలిపోనున్న భాగమతి సమాధిలా
నిత్యం అమాయకుల రక్తంతో తడుస్తూ
బుగులు పుట్టిస్తున్న పంజాబు లా
ఇవాళ....
ఈవేళ
నా హృదయం-
జ్వలిస్తున్న కువైట్ పెట్రోలు బావిలా
ముక్కలవుతున్న యుఎస్సెస్సార్‌లా
ఈహృదయం
నా హృదయం

పోచమ్మవాడ, ఆలేరు—౫౦౮ 101, నల్లగొండ జిల్లా

# అతడు-ఆమె

'విను'

అప్పుడెప్పుడో గతించిన గతంలో
లేతలేత గోధూళి వెలుతురులో
తూనీగలకోసం తుళ్ళిపడుతూ
బంతిపూల మళ్ళవెంట పరుగులు తీసినమనసు
రకరకాల అనుభవాలతో పండి
శూన్యంగా మిగిలిన నిండు పౌర్ణమి రేయిలో
చెట్ల నీడల్లో ఒంటరిగానే సాగిపోతూ
చల్లనివెన్నెల వెలుగులనే దోసిళ్ళనిండా నింపు
కుని
సేదదీరాలని ఆరాటపడే వయసులో
అతడు ఆమెపాలిట రాహువుగా మారి
అంతటా అంధకారమే నింపేసేడు.
ఆపైన
నిష్క్రియత మరణ ధర్మమని
ధర్మోపదేశాలు చేశాడు గానీ
గుండెల్లో అయిన గాయం
మానుపట్టీ పట్టకముందే
తిరిగి మరోవేటువేసి, వాక్కులన్నీ లాగేసి
మాయదారి మాటల మందులెన్నో పూసినా
సొన కారే వ్రణంనుంచి స్రవించేది
దుర్గంధ భరితమైన చీమూనెత్తురేగా!
నిరంతరం సలుపుదీసే మాయని గాయంతో
సహనం కూడగట్టుకుని
మౌనముద్ర ధరించిన మూగబోయిన గొంతు
పెదవి కదపి మాట పలికితే
వినిపించేది శాపనార్థాలే అయినా
అవి పరిణతి చెందేది, ప్రతిఫలించేది
ఆమెలోనే అయినపుడు
మౌనం వహించడం మంచిదన్నది
పెద్దలందరి ఉపదేశమేగా!
అయినా
అతడు అహంకారం విడనాడి
అందాకా అనుసరించిన పద్ధతులేవీ
మంచివి కావని, ఫలితం యివ్వనివని గ్రహించి
నప్పుడు
చిట్లిన నరాల్లోంచి ఉబికి దూకే వెచ్చనిరక్తంలో
తడిసి
ఆనందంతో గుండె పుప్పొంగి పోతుంది
జీవితం దానికదే కదులుతుంది.

స్నాతకోత్తర విభాగం, ద.భా. హిందీ ప్రచార సభ, మద్రాస్. 17

# ఆవేశం అక్షరమైన వేళ

నాగభైరవ కోటేశ్వరరావు

జీవితాన్ని కవిత్వీకరించేప్పుడు
దృష్టి ఆలోచనగా మారుతుంది
దిగంతాలు శూన్యాలవుతాయి
మెదడు ట్రాన్స్‌ఫార్మర్ నుండి
బయలుదేరిన విద్యుత్తరంగాలు
నరాల్లోంచి కరాగ్రపు కలంలోకి
ప్రవహించి
ఆవేశం అక్షరంగా ఆవిర్భవిస్తుంది-

అప్పుడు—ఎదురుగా ఉన్న నువ్వు
అదృశ్య విగ్రహానివవుతావు;
నాకు నేనే గుర్తుండను-
చెవి వినదు, అక్షి కనదు
పంచేంద్రియాలు ఒక్క-ప్రపంచాన్నే
పంచుకొనే పాండవులవుతాయి;
నేను లోకంలో ఉండీ
లేకుండా పోతాను:

కలం కొన్ని అక్షరాలని
అందంగా ప్రసవిస్తుంది
అవి పక్షులగుంపులై పైకిపోయి
దిక్కులకు సంగీతదానం చేస్తాయి-

మరికొన్ని అక్షరాలు
కసిగా రాలి, కరవాలాలుగా తేలి
గాలికి కర్తవ్యం నూరిపోస్తాయి
ఇంకాకొన్ని అక్షరాలు
అనుభవాల వేదాలై, ఆవిరులై
పైకిపోయి మేఘాలై
ప్రబోధవర్షాలు కురుస్తాయి-
రేపు నువ్వూ నేనూ ఉండము
అక్షరాలు అక్షయాలై
చిరంజీవులవుతాయి.

శ్రీనాగభైరవ ఎడ్యుకేషనల్ అకాడమీ, గుళ్ళపల్లి, ప్రకాశం జిల్లా 528211

# కథావీధి

తెలుగు కథ

## గాడు

ఇల్లిందల సరస్వతీదేవి

ఉదయం తొమ్మిది గంటలవేళ.

అది నీలోఫర్ హాస్పిటల్లో పిల్లలవార్డు.

వార్డు ముందర కారిడార్‌లో ఆయాలూ వార్డ్ బాయ్‌లూ గుంపుగా చేరి గుసగుస లాడుకుంటున్నారు.

'ఆ పిల్లవాడిమీద పెద్ద డాక్టరు గారికి అంత శ్రద్ధ ఏమిటి? ఆయన బంధువా?'

'బంధువు కాదుగాని రికమెండేషన్ కేసేమో?'

'వాడొక బిచ్చగాడిలా ఉన్నాడు చూస్తే?'

అంతలో వార్డు డాక్టరు కళ్ల డాక్టర్ని తీసుకుని ఆ దారిన రావటం చూసి ఎక్కడి వాళ్లక్కడ సర్దుకుని ఎవరి పనుల మీద వాళ్ళు వెళ్ళిపోయారు.

కళ్ళ డాక్టరు తన పరికరాలు బల్లమీద పెట్టి స్టూలు మంచం ధగ్గరగా లాక్కుని, పిల్లవాడి కళ్ళను చూశాడు. ఒక్కొక్క పరికరాన్నే ఉపయోగించి చూస్తున్నాడు.

'నా కేసి చూడు'

'కళ్ళు పక్కకు తిప్పిచూడు'

'ఇదేమిటో చెప్పగలవా? కనబడుతోందా బాగా?'

కనబడుతోందయ్యా'

'ఇదేమిటి?' కుర్చీని చూపించి అడిగాడు.

అదీ...అదీ....కూచునేది'

దీన్ని కుర్చీ అంటారు. దాని కాళ్ళు కనబడుతున్నాయా?'

'ఆఁ'

'నేను కనబడుతున్నానా?'

'ఆఁ'

"అటుచూడు—ఆ మంచాలు—ఆ చివరి మంచం కూడా కనబడుతున్నదా?'

'ఆఁ'

'ఇదేం రంగు?'

'నల్లగా'

డాక్టరు వరసగా రంగులన్నీ చూపించాడు.

అన్ని పేర్లు వరసగా చెప్పాడు పిల్లవాడు ఇంచు మించుగా.

'వీడికి కళ్ళకేమీ జబ్బులేదు. దృష్టి బాగుంది. అసలు ఏం జబ్బని చేర్చుకున్నారు?' అడిగాడు కళ్ళ డాక్టరు.

డాక్టరు సుధీర్‌గారు హాస్పిటల్‌కి వస్తుంటే కారు కింద పడబోయాడట. కొద్దిగా దెబ్బలు తగిలాయి. ఆయన తీసుకొచ్చారిక్కడికి. గాయా

'సుదర్శన' 2-2-1118 1/2, న్యూ నల్లకుంట, హైదరాబాదు—44.

లకు మందువేసి కట్టుకడుతున్నాము. త్వరగా తగ్గటానికి మాత్రలు ఇస్తున్నాము. కళ్ళు కూడా పరీక్ష చేయించమన్నారు. అందుకే మిత్రుల్ని పిలిచాను.'

'అలాగా కళ్ళకేమీ జబ్బులేదు. దృష్టి బాగా ఉందని కేస్ షీట్‌లో రాస్తున్నాను. వారికి ఫోను చేసి చెప్పండి' అంటూ విష్‌చేసి వెళ్ళిపోయాడు.

వార్డు డాక్టరు లోపలికివచ్చి స్టూలు మీద కూర్చుని 'నీ పేరు?' అడిగాడు పిల్లవాడిని.

'అబ్బిగాడు'

'నావేపు చూడు'

అబ్బిగాడు కళ్ళు తెరిచాడు. కనుగుడ్లు గుండ్రంగా తిరుగుతున్నాయి.

'నీవు కావాలని గుడ్లు తిప్పుతున్నావు కదూ?' లేపి కూర్చోబెడుతూ, 'నిజం చెప్పు? కావాలని చేస్తున్నావు కదూ? నిన్న వార్డుబాయ్ కొట్టినట్లు చెంపమీద కొడతాను. నిజం చెప్పకపోతే' గట్టిగా చెవి పట్టుకున్నాడు.

అబ్బిగాడు ఏడుస్తూ 'నావోళ్ళందరు చెప్పి నారయ్యా గుడ్లుతిప్పుతూ కళ్ళులేని వాడినంటే జనమంతా పైసలిస్తారని' అన్నాడు.

'నీకు అమ్మా నాయనా ఉన్నారా?'

'ఏమో బాబయ్యా'

పైసలడుక్కుని ఎవరికిస్తావు? ఎవరి దగ్గరుంటున్నావు?'

మా అవ్వకిస్తా. అది గంజి కాచి పెడితే ఇద్దరం తాగుతాం'

'ఎక్కడుంటారు?'

'అక్కడ....రైలు కట్టకావలి గుడిసెల్లో'

సరేగాని—వార్డుబాయి చెప్పినట్టు విని దెబ్బలకు మందు రాయించుకో' డాక్టరు అబ్బిగాడి మంచం దగ్గర్నించి కదిలాడు.

అబ్బిగాడు స్టేషను కవతలి వైపుగా ఉన్న ఆంజనేయులు గుడికి పోయేదారిలో మెట్లమీద కూర్చుంటాడు. మెట్టుమెట్టుకూ బిచ్చగాళ్ళు కూర్చుంటారు. గుడికి వచ్చే భక్తులు పైసలు వేస్తారు. తిరిగిపోయే భక్తులు పండ్లు ప్రసాదాలు పెడతారు. ప్రతి బిచ్చగాడి చేతిలోనూ ఒకడబ్బా ఉంటుంది. ఆ డబ్బాలో వేయించుకుంటారు. దేవాలయానికి భక్తులు ఉదయం, సాయంత్రం వస్తారు. నూకలు—డబ్బులు-ప్రసాదాలు—ఏవో వాళ్ళ డబ్బాలలో పడుతూనే ఉంటాయి.

అబ్బిగాడు ఒంటిమీద మాసికలు వేసిన నిక్కరూ బుజాలదగ్గర చినిగిన బుష్‌షర్టూ వేసుకుంటాడు, ఒంగి మోకాలిమీద చెయ్యిపెట్టుకుని గుడ్లుతిప్పుతూ నడుస్తాడు. బిచ్చగాళ్ళతో కుంటుతూ గుడికివెళ్ళి, తన మెట్టుమీద కూర్చుంటాడు. తనకు దొరికిన దాంట్లో తినగలిగినవి అక్కడే తిని, మిగిలినవి అవ్వకిస్తాడు. వార్డు బాయ్ నవ్వుతూ బాగా మాట్లాడినప్పుడు తన సంగతంతా చెబుతూ ఉంటాడు. ఈ సంగతి అక్కడివాళ్ళకందరికీ మూడోనాటికలా తెలిసిపోయింది.

పెద్దడాక్టరు అబ్బిగాడ్ని చూడటానికి వస్తాడని తెలియగానే, వార్డుడాక్టరు ఎదురుగా వెళ్ళి అబ్బిగాడిని గురించిన వివరాలన్నీ చెప్పాడు.

'వీడికి కాలుకూడా సరిగా లేదని డ్రైవరు చెప్పాడు. కాలు చూశారా?' అంటూ అబ్బిగాడి మంచం దగ్గరకొచ్చి 'నిలబడి కాలుచూపించు' అన్నాడు.

అబ్బిగాడు ఎడమకాలిని పూర్తిగా చాపలేక పోయాడు మోకాలికిందిభాగం వంకరగా ఉండి పాదం మడమ దగ్గరనుంచి మెలిక తిరిగింది

కాలికి ఎక్సురే తీయించి నాకు రిపోర్టు పంపండి పెద్దడాక్టరయిన సుధీర్ ఇంటికి వెళ్లాడు ఈ బిచ్చగాడెవరో గాని పెద్ద డాక్టరుగారి కంట బడ్డ అదృష్టవంతుడు! వార్డు డాక్టరు గొణుక్కుంటూ ఎక్సురే తీయించి రిపోర్టు పంపించాడు

అబ్బిగాడికి మడమ దగ్గర ఫ్రాక్చరయి వంకరగా అతుక్కుంది మోకాలికింద ఎముక కూడా జాయింటు నుంచి బయటికి వచ్చి ఆపుగా కాయకాసినట్లుగా ఉంది

డాక్టరు సుధీర్ రిపోర్టుచూసి ఆర్థోపెడిక్ సర్జనుకు రిపోర్టు చూపించి ఆపరేషన్‌కి ఏర్పాటు చేయించండి ఇంటి నుంచి టెలిఫోను చేస్తూ సర్జను రాగానే తనకు తెలపమని చెప్పాడు

అనుకోవటం తడవుగా ఆ మరునాడే అబ్బిగాడి కాలికి ఆపరేషన్ జరిగింది సుధీర్ ఇంటికి వెళ్తూతూ వీడికి స్పృహ వచ్చిన తరువాత నాకు ఫోను చెయ్యండి' అని వీడిని జాగ్రత్తగా కనిపెట్టి చూడండి థియేటరు నర్సుకు ఆజ్ఞాపించి వెళ్లాడు

అబ్బిగాడు మత్తులో ఉన్నాడు మధ్య మధ్య మూలుగుతూ ఉన్నాడు [illegible] స్పృహ వచ్చే [illegible]

'ఉంది కాలు? బాగా నొప్పిగా ఉందా?' అక్కడే కుర్చీలో కూర్చున్న సర్జను అడిగాడు అబ్బిగాడిని గమనిస్తూ ఎప్పుడు స్పృహలోకి వస్తాడా అని చూస్తున్నాడు

నొప్పి బాబయ్యా నా కాలు ఇరిచేసినారేటి బాబయ్యా? ఏడ్చాడు

విరిచెయ్యలేదురా నీవు కుంటుతున్నావు కదా! నీవు బాగా నడవాలని ఆపరేషన్ చేశాను నొప్పి తగ్గిన తరువాత వాకర్‌తో మెల్లగా నడవటం నేర్చుకో తరువాత పరుగెత్త గలుగుతావు పరుగెత్తే ఆటలు ఆడుకోవచ్చు ఈ మాత్రలేసుకో నొప్పి తగ్గిపోతుంది నిద్రకూడా వస్తుంది నేను రోజూ వచ్చి చూస్తాను నీవు రేపటికి నవ్వుతూ హుషారుగా నాకు కనబడాలి ఏం? బుజం తట్టి చేత్తో తలనిమిరి వాడిని నవ్వించి వెళ్లాడు సర్జను

మరి కాసేపటికి నిద్రలో జారుకున్నాడు అబ్బిగాడు

డాక్టరు సుధీర్ వాడిమీద చూపిస్తున్న శ్రద్ధకు వార్డు డాక్టరు సర్జను కూడా వచ్చి చూస్తున్నారు సర్జికల్ వార్డు స్టాఫంతా అబ్బిగాడి పనే ముందు చేస్తూ పలకరిస్తూ గౌరవంగా చూస్తున్నారు

అబ్బిగాడి ఒంటిరంగు మట్టికొట్టుకు పోయినట్టుగా ఉండేది రేగిన రాగివెంట్రుకలూ చినిగిన బట్టలూ లోతుకు పోయిన కళ్ళూ పీక్కుపోయిన ముఖమూ, కుంటికాలి నడకా వాడేం చేస్తూ ఉంటాడో చూడగానే తెలిసిపోతుంది వాడికి ఆపరేషన్ అయిన తరువాత ప్రతిరోజూ స్పాంజిబాత్ ఇస్తున్నందువల్ల ఒంటికి చాయ వచ్చింది పాలు గుడ్లు పళ్లు వంటి పుష్టికరమైన ఆహారం తీసుకుంటున్నందువల్ల బుగ్గలు నునుపుతేలాయి తల వెంట్రుకల ఎరుపుదనం తగ్గుతున్నది వార్డు డాక్టరు [illegible] వల్ల గుడ్లు తిప్పుతూ [illegible] లోతుకుపోయిన కళ్లతో దైన్యంగా చూసే చూపులలో కాంతులు కనబడుతున్నాయి

ఆ రోజు పెద్ద డాక్టరు తనపని అయిన తరువాత అబ్బిగాడిని చూడటానికి వచ్చేసరికి పక్కకు తిరిగి పడుకుని నిద్రపోతున్నాడు అతడి

చెంప ముగ్గు దానికింద ముడుచుకున్న ఎర్రటి పెదవులు చిన్ననోరు కణతమీద పావలా కాసంత పుట్టుమచ్చ వాటిని చూడగానె ఆయనకు చెత్తో నిమరాలనిపించింది ఐదు నిమిషాల సేపు కన్నార్ప కుండా చూసిన ఆయనకు కడుపులో నుంచి ఆవేశం లా టిది ఉబికి ఉబికి పైకి తన్నుకు వచ్చి ట్లయింది

చెత్తో కళ్ళు మూసుకుని మంచం దగరగా కుర్చీ లాక్కుని కూర్చున్నాడు

అబ్బిగాడు లేస్తే ఎట్లా ఉందిరానీకు? అని అడగాలని, వాడు మాట్లాడు తుంటే వినాలని

కాని వాడిని లపబుద్ధి పుట్టలేదు

కప్పుఉన్న దుప్పటినే తీసి దులిప మళ్ళీ కప్పి వెళ్ళి పోయాడు

ఇంటికి వెళ్ళి భోజనంచేసి పడుకుందామని మంచంమ్మీద మేను వాల్చాడు

అబ్బిగాడి ముఖం—కణత మీద ఎర్రటి పుట్టుమచ్చ ఆయన కళ్ళముందర బొమ్మకట్టి నట్లయింది

దీర్ఘాలోచనలో పక్కకు తిరిగి పడుకున్నాడు

అబ్బిగాడిముఖం ఆ నోరు ఆ నవ్వు ఆయనను కలవర పెట్టేస్తున్నాయి

రాత్రిళ్ళు లల్లో వాడు

పగలు కళ్ళముందరవాడు

కన్నుమూసినా తెరిచినా వాడు

ఏమిటీబాధ?

లేచి వేడివేడి టీ తాగి కిందిగి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు

అతడికి ఎంత సంపాదించినా మనసుకు సంతోషము సుఖశాంతుల్లేవు అనురాగంతో మన సులో మనసు కలిపిన భార్య ఉన్నది కాని ఇప్పుడామె అతడిని గుర్తుపట్టనట్లె వట్టిచూపులు చూస్తుంది ఒకోరోజు భోజనమే వెయ్యదు ఎక్కడ కూర్చుంటే అక్కడే కూర్చుండిపోతుంది ఎక్కడో ఉ టాయి ఆమె ఆలోచనలు ఎలిస్తే ఎంతసేప టికో పలుకుతుంది అడిగిన ప్రశ్నకు ఈ లోకం లోకి అప్పుడే వచ్చినట్టుగా జవాబు చెబుతుంది పొడిపొడి మాటలతో

గదిలో ఆమె చదివిన పుస్తకాలు ఆమె తీర్చి దిద్దిన చిత్తరువులు—ఆమె సవరించిన వీణ తీగెలు దుమ్ముకొట్టుకు పోతాన్నాయి ఎప్పుడూ ఆ గది లోనే పగలంతా గడిపిన ఆమె ఇప్పుడాగది చాయ లకే పోదు ఎప్పుడు గలగల్లాడుతూ మాట్లాడుతూ అందరినీ నవ్విస్తూ— తాను నవ్వుతూ ఉండే ఆమె మనసారా నవ్వటమే మానేసింది కాదుకాదు మరచి పోయింది

డాక్టర్ సుధీర్ మాత్రం? ఎనిమిది సంవత్స రాల నుంచీ మానసికంగా చిత్రవధ అనుభవిస్తు న్నాడు టెన్నిస్ ఆట అంటే అతడికి ప్రాణం ఇప్పుడా మాట వింటేనే కిందటి జన్మలోదామాట అనుకుంటాడు

ఇప్పుడాయిద్దరూ రాగరంజితమైన హృద యాలు గల దంపతులు కారు నిర్లిప్తులు

డ్రైవరు వచ్చినట్టుగా నౌకరు వచ్చి చెప్పాడు

సుధీర్ అతడిని ఎలిచి సువం హాస్పిటల్లో చేర్పించిన చల్లవాడు ఎక్కడో గుడిసెల్లో ఉంటా డని వారుబాయ్‌కి చెప్పాడట వాడికో అవ్వ ఉందట నీవు అక్కడికి కెళ్ళి ఆ అవ్వను మనింటికి రేపు తీసుకురా ఆమెను భయపెట్టకుండా మంచిమాటలు చెప్పి తీసుకురా డ్రైవరును పంపించాడు

ఆ రాత్రి సుధీర్‌కి నిద్రపట్టలేదు గదిలో ఇటూ అటూ తిరుగుతూ కొంతసేపు గడిపాడు

పదకొండు గంటలవేళ టి.వి.లో వచ్చిన డిటెక్టివ్ సినిమా చూశాడు. ఆ తరువాత గడియారం కొట్టిన ప్రతిగంట విన్నాడు.

తెల్లవారగానే స్నానంచేసి కప్పు కాఫీతాగి లాన్‌లో సిమెంట్ బెంచీ మీద కూర్చుని పత్రిక చేతబట్టాడు. కాని అతడి మనసు డ్రైవరు రాకకోసం ఎదురు చూస్తోంది.

ఎనిమిది గంటలవేళ డ్రైవరు అబ్బిగాడి అవ్వను తీసుకుని వచ్చాడు. చింపిరి జుట్టుతో మురికి ఓడుతున్న చీరచెంగులు పైకి దోపుకుని 'దణ్ణాలయ్యా" అంటూ చేతులు జోడించింది ఎదురుగా నిలబడి.

డాక్టరు పత్రిక పక్కకు పెట్టి తలెత్తిచూశాడు.

'అయ్యా మా అబ్బిగాడు........'

'అబ్బిగాడు కారుకు అడ్డంవచ్చి కింద పడ్డాడు. కాళ్ళకు దెబ్బలు తగిలాయి. ఆస్పత్రిలో మందులేసి కట్టుకడుతున్నారు. రెండు మూడు రోజుల్లో ఇంటికి వస్తాడు. వాడు నీ కొడుకా?'

దేహం ఒడిలిపోయిన అవ్వ కళ్ళు చిట్లించి చూస్తూ 'ఏందయ్యా' అన్నది భయపడుతూ.

అవ్వకు వినబడదని గ్రహించి 'అబ్బిగాడు నీకేమవుతాడు?' గట్టిగా అరిచాడు.

'అబ్బిగాడు నన్ను అవ్వాఅని పిలుస్తడు, నాకు దిక్కులేదు. ఆడే ఇంత ఆడుక్కొచ్చి పెడితే తింటూ ఉండా. గింజలు తెచ్చిస్తే గంజి కాచుకుని తాగుతం. ఆడు కండ్లబడి పదినాళ్ళాయె, పక్క గుడిసెలోళ్ళు ఇంత కాచి పోస్తుండారు'

'అసలు అబ్బిగాడెవరు?' డ్రైవరు గట్టిగా ఆమె చెవిలో నోరు పెట్టి అరిచాడు.

'అణ్ణి సాకుతుండా అయ్యా'

'వాడికి తల్లిదండ్రిలేరా?'

'లేరయ్యా'

'మరెక్కడి నుంచి తీసుకొచ్చి సాకుతున్నావు? చెప్పు?' డ్రైవరు బెదిరించాడు.

అవ్వకు పోలీసుల భయమెక్కువ. పోలీసులకు పట్టిస్తాడేమోనని గజ గజ ఒణుకుతూ-ఏడుపు గొంతుతో—'అప్పుడు ఆ వంతెనకాడ రైలుడబ్బాలు దొర్లిపోయినప్పుడు మా గుడిసెలోళ్ళందరూ పరుగెత్తి దొరికినవన్ని తెచ్చుకున్నరు. ఈ పిల్లడు కట్టకింద దుబ్బల్లో పడి ఏడుస్తాఉంటే నేను చంకనేసుకున్న. జనం-పోలీసులు ఆడికొచ్చి అందర్ని యెళ్ళగొట్టినారయ్యా లాటీలతో బెదరగొట్టి. అప్పటి నుండి ఆణ్ణి సాకుతున్నానయ్యా. కొంచెం పెద్దగయి నాక-తోటివాళ్ళన్నరు గందా-'సాకు సాకితే నీకు ముందు గంజిసీళ్ళు పోస్తడు" ఇంకొకడొచ్చి 'అవ్వా ఈడి కాళ్ళిరుద్దునా—కళ్ళుపొడుద్దునా' అన్నడు. ఆణ్ణి ఏంచెయ్యకండిరా అని అరిచినా. మొత్తుకున్నా. 'కాళ్ళిరవక—కళ్ళుపొడవకపోతే ఎన్నాళ్ళిట్ల సాకుతవు? కళ్ళుపొడిస్తే గుడ్డివాణ్ణయ్యా అంటూ అడుక్కొస్తడు' అని చుట్టూ మూగినరు. 'ఆడికళ్ళు సుక్కలల్లే ఉన్నయి. ఆడు ముత్తెంలాగున్నడు. ఆడిజోలికి రామాకండి అని' అరుస్తా ఉండానయ్యా-ంతలో ఒకడొచ్చి అబ్బిగాడి కాలువిరిచి తిప్పేసినాడు. అబ్బిగాడు ఏడ్చుకుంటూ పాకుతూ తిరిగేవోడు. నాలుగేళ్ళాయె. అందరితోపాటు ఆ గుడికాడికిపోయి ఇన్ని డబ్బులోగింజలో పండ్లో తెస్తే ఇద్దరం తింటున్నాం దొర, నేను కాగితాలు ఏరుకొస్తాదొర. అవన్ని సంచిలో ఏసుకుని మా గుడిసెలో ఉన్నవాడు అమ్మికొచ్చి కొన్ని పైసలిస్తడు,అబ్బిగాడు కండ్లపడక ఎన్నాళ్ళాయెనో దొర. ఏడుపు మొదలుపెట్టింది.

'అబ్బిగాడు నీ కొడుకు కాడు- మనవడు కాడు నీవెందుకేడస్తవ్' డ్రైవరన్నాడు.

'ఆడు లేకపోతే తిండేదయ్యా. ఎవరు పెడతారు?'

'నీ కడుపుకు తిండి కావాలి. అదే కదా నీకు కావలసింది? తిండి ఎవరయినా పెడితే అబ్బిగాడు లేకపోయినా సరేనా?' ఎర్రబడిన కళ్ళతో అడిగాడు సుధీర్. అబ్బిగాడి సంగతంతా విన్న తరువాత అతడి కడుపు మసిలిపోయింది. బిచ్చమెత్తటానికి వాళ్ళు అవలంబించే మార్గాలు ఇవన్న మాట!

'ఆడెక్కడికి పోతడయ్యా నన్నొదిలిపెట్టి? ఇన్నాళ్ళనుండీ సాకుతున్న గదయ్యా'

'ఎక్కడికీ పోడు. కాని- నీవు కష్టపడి సాకినందుకు డబ్బులిస్తే వాడిని వదిలిపెడతావా?'

'అణ్ణి సూడాలనిపిస్తది గదయ్యా?'

'వాడిని చూసి ఏం చేస్తావు? అడుక్కున్నీ తమ్ముణ్ని పంపిస్తావు. వాడు ఇంకెక్కడయున్నా ఉంటే, చదువు చెప్పించి గొప్పవాణ్ణి చేస్తారు. నీవు చదువు చెప్పించలేవు కదా? అందుకే డబ్బిస్తారు. తీసుకెళ్ళి బతుకు హాయిగా, ఎప్పుడయినా వచ్చి చూడు వాడిని. ఇంకేమయినా కావాలంటే అడుగు. నీ దగ్గరుంటే మాత్రం పోలీసులొస్తారు. నిన్ను కొట్లో తోస్తారు' డ్రైవరు ముందుకొచ్చాడు.

పోలీసులొద్దు బాబయ్యా. కొట్టి చంపుతరు' అన్నది భయపడుతూ.

డ్రైవరు చేతికి ఐదువందల రూపాయలిచ్చి సుధీర్ లోపలికి వెళ్ళాడు.

సుమిత్ర బల్లముందర కుర్చీలో కూర్చుని, ఒక గ్లాసులోనుంచి మరొక గ్లాసులోకి కాఫీ ఆర పోస్తున్నది.

రెండు నిమిషాలు చూసి 'గ్లాసుడు కాఫీని అర గ్లాసెడు చేశావు. చప్పగా చల్లారింది. ఇక తాగు' అంటూ గ్లాసు నామె చేతికిచ్చి నోటిదాకా తీసుకెళ్ళాడు.

ఇష్టంలేనట్టు ముఖం పెట్టి తాగింది సుమిత్ర.

'గుడ్, కాఫీ తాగావు. స్నానంచేసి మంచి చీర కట్టుకురా'

'ఎందుకు?'

'మనం కార్లో అట్లా బయటికి వెళ్ళివద్దాం. ఈ ఊరి హాస్పిటల్ చాలా పెద్దది. అందంగా ఉంటుంది. నీవు ఎప్పుడూ అటువంటిది చూసి ఉండవు'.

'ఇది పెద్దఊరు. ఊరికి తగ్గట్టు పెద్దదయి ఉంటుంది. అందంగా ఉండటంలో ఆశ్చర్యమేముంది?'

'నీ మాటలో నిజం లేకపోలేదు. అసలు సంగతి నేనివాళ హాస్పిటల్లో ఒక ఆపరేషన్ చెయ్యాలి. నేను ఆపరేషన్ చేసి చాలారోజులయింది. నీవు నాతో కూడా వచ్చి నాగదిలో కూర్చుంటే నాకు ఎంతో ధైర్యంగా ఉంటుంది.'

ఆమె కళ్ళెత్తి అతడి ముఖంలోకి చూసింది. ఆ చూపులో 'నాకు హాస్పిటల్లంటే భయమని మీకు తెలియదూ' అన్న భావం ప్రశ్నార్థకంగా ఉంది.

'ఇవాళ నా కసలే భయంగా ఉంది. చేతులు వణుకుతున్నాయి. ఆపరేషన్ సక్సెస్ కాకపోతే ఆ తల్లిదండ్రులు ఏడుస్తారు.'

'ఏడవనియ్యండి. లోకంలో ఎందరు ఏడవటం లేదు?'

'ఏడుస్తున్నారు నిజమే. వాళ్ళేడుస్తున్నారని వీళ్ళని కూడా ఏడిపిద్దామా చెప్పు? ఆపరేషన్ సక్సెసయితే "నన్ను పాలింప నడిచి వచ్చితివా...' అంటూ కీర్తన పాడుకుంటారు నిన్ను చూసి. నిజం!'

పాలిపోయిన ఆమె ముఖంలోకి రక్తం పొంగుకుంటూ వచ్చింది. ముఖం ప్రసన్నమయింది.

ఆమె ఎటువంటి మానసిక వేదనలో ఉన్నా ఆ కీర్తన పేరెత్తితే చాలు తన్మయురాలవుతుంది.

దిగ్గున లేచి స్నానాల గదిలోకి వెళ్ళింది.

'ఇంతకాలం నుంచి తన కెందుకా ఉపాయం తోచలేదు? మెదడు మొద్దు బారిపోయిందా?' అనుకుంటూ సుధీర్ పైకి వెళ్ళి డ్రెస్ చేసుకుని కిందికి దిగి వచ్చేసరికి సుమిత్ర సిద్ధంగా ఉంది.

'పదండి"

కారులో తన పక్కన ఆమె కూర్చోవటం నిజమే కదా అని పదే పదే ఆమెను ఉండ చూసుకుంటూ కారు నడిపాడు సుధీర్.

హాస్పిటల్లో ఆమెను తన గదిలో కూర్చోబెట్టి 'ఈ పత్రిక చూస్తూ ఉండు' అని గంటన్నరకు తిరిగి వచ్చాడు.

'ఆపరేషన్ అయిందా? సక్సెస్‌ఫుల్?'

'నీ దయవల్ల బాగా జరిగింది. పేషంటుకు ఇంకా బాగా స్పృహ రాలేదు. అసిస్టెంటు దగ్గరున్నాడు. ఇంటికి వెళ్ళేటప్పుడు ఒకసారి చూడాలి' అంటూ ఫ్లాస్కులో ఉన్న కాఫీని రెండు కప్పులలో పోశాడు. ఒకటి ఆమె కిచ్చి తానొకటి తీసుకున్నాడు.

వేడివేడి కాఫీ తాగి ఇద్దరూ ఫాను కింద కూర్చున్నారు విశ్రాంతిగా.

ఏమనుకున్నాడో సుధీర్ దిగ్గున లేచి; పిల్లల వార్డునుంచి టెలిఫోను వచ్చింది-ఒకసారి వచ్చి చూడమని. నీవు కూడా రా. తొందరగా వచ్చేద్దాం. నేను ఆపరేషన్ చేసిన పేషంటును చూడాలి' అన్నాడు.

తల ఊపుతూ లేచింది సుమిత్ర. పిలల వార్డులోకి వెళ్ళినప్పుడు- హలో హలో అంటూ అందరినీ పలకరిస్తూ అబ్బిగాడి మంచం దగ్గరికొచ్చి 'అబ్బిగా! ఎట్లా ఉంది కాలు? నొప్పి తగ్గిందా? నిన్ను చూస్తానంటే ఈ డాక్టరమ్మను తీసుకొచ్చాను దణ్ణం పెట్టు' అన్నాడు.

నవ్వు తెచ్చుకుని 'దణ్ణాలు డాక్టరమ్మా' అన్నాడు చేతులు జోడించి పళ్ళు కనబడేటట్లుగా నవ్వాడు.

ఆమె వట్టిచూపులతో అందరినీ చూస్తూ వాడిని కూడా చూసింది. సుధీర్ ఆమెన్నే కనిపెట్టి చూస్తున్నాడు.

తనను ఆమె హలో అని పలకరించలేదని చిన్నబుచ్చుకున్నాడు అబ్బిగాడు.

ఇంటికి వచ్చిన తరువాత ఆమె ఉత్సాహంతో మాట్లాడుతుందని ఆశించాడు సుధీర్.

కాని ఆమె మామూలు సుమిత్రగా మారిపోయింది ఇంటికి రాగానే.

ఉతడి సంతోషం ముచ్చటగా మూడు గంటలలో ముగిసి పోయింది.

ఆ రాత్రి సుమిత్ర భోజనం చెయ్యలేదు.

'పోనీ పాలైనా తాగు' బ్రతిమిలాడాడు సుధీర్.

'పిలల వార్డుకి నన్నెందుకు తీసుకెళ్ళారు?' అంటూ ఆమె పక్కకు తిరిగి పడుకుంది.

'ఏం జరిగింది?'

'అబ్బా! నన్నట్లా అడగకండి. నాకు పిచ్చెక్కినట్టుగా ఉంది.'

ఆరేళ్ళక్రితం రైలుప్రమాదంలో తనుపోగొట్టుకున్న మూడేళ్ళ నందూ కళ్ళలో మెదిలాడు. వాడి కళ్ళుచూసి ఆమెఅన్నగారు 'ఆకర్ణాంత నయనాలు విశాలనేత్రాలు-కలువరేకుల్లాంటి కన్నులు' అంటు వర్ణించేవాడు కణత మీద ఎర్రటి పుట్టు మచ్చ— అదీ కుడివైపున ఉంటే చాలా అదృష్టవంతుడమ్మా అనేవాడు. వాడేం అదృష్టవంతుడు? రైలు ప్రమా

దంలో రైలు పెట్టెలో నుంచి తమ పిల్లవాడితో బయట పడటమే కష్టమైంది. తను అన్నగారి కోసం చూస్తుండగా ఆజనం తోపిడిలో తనోమూలకు పడిపోయింది. పిల్లవాడెటు పడ్డాడో? ఒకటే జన సందడి-పరుగులు ఏడుపులు-ఎప్పటికో తను అన్నగారిని కలుసుకోగలిగింది. ఆయన కిందపడి ఉన్నాడు. ఆయనను లేపి 'అన్నయ్యా, నందూ నందూ' అంటూ ఏడవనారంభించింది. ఇద్దరూ వెతికి వెతికి వేసారిపోయారు.

సాయంత్రమయింది. అతడామెకు నచ్చచెప్పి టాక్సీలో తల్లిదగ్గరకి తీసుకువెళ్ళాడు.

అమ్మా లేవలేని దానవు. ఏడవకు. అన్నయ్య వెళ్ళి వెతికి కనబడకపోతే పోలీసు రిపోర్టు ఇస్తాడు. నందూ కనబడతాడులే' సర్దిచెప్పి ఊరడించింది తల్లి. ఆ మరునాడే సుమిత్రకు హాస్పిటల్లో పురుడొచ్చింది. నందూలాంటి పిల్లవాడు పుట్టాడు.వాడిని చూసుకుంటూ సంతోషంగా ఉంటుందని అన్నగారు రైలుపడిన చోటికి వెళ్ళి పిల్లవాడిని గురించి అందరినీ అడిగాడు. అధికారులెవరూ చెప్పలేక పోయారు.

అతను తిరిగి వచ్చేటప్పటికి రెండు రోజులు పట్టింది. నందూని మరపించిన పిల్లవాడు కన్ను మూశాడు.

సుధీర్ వచ్చి ఓదార్చినా లాభంలేకపోయింది.

ఆమెకు ఏదీ సంతోషాన్ని కలిగించలేక పోతున్నది.

సుధీర్ తనంటే ప్రాణమిస్తాడు. కాని-తన కడుపులో చిచ్చురేగుతూఉంటే ఆమెకీలోకంలో ఏమీలేనట్టుగానే ఉంది. సుధీర్ చిన్నబోయిన ముఖంతో ఆమెకళ్ళలోకి చూస్తాడు. ఆచూపులు ఆమెను ఏమాత్రం కదిలించలేకుండా ఉన్నాయి.

ఏమిటీ జీవితం?

ఇంతటి దురదృష్టం ఎవరికైనా ఉంటుందా?

కన్నీళ్ళు కారిపోతున్నాయి. తలగడా తడిసి పోతున్నది.

సుధీర్ ఆ మరునాడు కూడా హాస్పిటల్‌కి వెళ్తూ' నీవు కూడా నాతో రాకూడదూ? నాకుకొంచెం ధైర్యంగా ఉంటుంది?' అంటూ అర్థించినట్టుగా ఆమె కెదురుగా వచ్చి కూర్చున్నాడు.

ఆక్షణంలో అతడి ముఖంచూసిన ఆమెకు గుండె చలించినట్లయింది. అతడిమీద ఎక్కడలేని జాలి కలిగింది. పాపం అతడు ఏం సుఖపడుతున్నాడని? ఆప్యాయమైన పలకరింపుకోసం అలమటించి పోతున్నాడు. జీవితంలో అతడికేం మిగిలిందని? ఇట్లు కొన్నాళ్ళుంటే పిచ్చివాడయి పోతాడు. ఇద్దరూ ఒకరినొకరు ఓదార్చుకోవాలి. అతడికి తను తన కతడు.

చటుక్కున లేచి, చీరె మార్చుకుని, ఇంటికి తాళం వేసి బయలుదేరింది.

హాస్పిటల్‌లో అతడు అన్ని వార్డులూ ఒకసారి చూసి రావటానికి బయలుదేరాడు.

అతడట్లా వెళ్ళగానే ఆమె పిల్లల వార్డుకేసి తను తెచ్చిన బిస్కెట్లతో బయలుదేరింది. అందరినీ హలో హలో అంటూ పలకరించి బిస్కెట్లు ఇచ్చి, అబ్బిగాడి మంచం దగ్గరికొచ్చి నిలబడి పోయింది.

సుధీర్ ఆమెను వెతుక్కుంటూ వచ్చాడు.

'నీ విక్కడున్నావా? అమ్మయ్య. ఎన్ని వార్డులూ తిరిగానో నీ కోసం?' అంటూ 'హలో అబ్బిగా. ఏమయినా తిన్నావా?' అని అడిగాడు మంచమ్మీద కూర్చుని.

తిననట్టుగా తల అడ్డంగా తిప్పాడు.

'ఎందుకు తినవు?'

'అయ్యా. నాకిక్కడ బాగాలేదు. నేను అవ్వ దగ్గరికి పోతా'.

'ఇంకా బాగా నడక రాలేదు. ఇప్పుడే ఇంటికి పోతే మళ్ళీ కుంటివాడివయిపోతావు. ఇక్కడ ఉంటే వార్డ్‌బాయ్ వాకర్‌తో జాగ్రత్తగా నడవటం అలవాటు చేస్తాడు. నడక బాగా వస్తే స్కూలుకు వెళ్ళి చదువుకోవచ్చు. రైళ్ళు కార్లు కీ యిస్తేనడిచే బొమ్మలు కొనుక్కొని ఆడుకోవచ్చు.' అన్నాడు అబ్బిగాడు సంతోషిస్తాడని.

'నాకు అవ్వ కావాలి. నడిస్తే బిచ్చమెవరు యేస్తారయ్యా"

'అవ్వంటే వాడికెంత ప్రేమో? అనుబంధం ఉంటే అట్లా అనిపిస్తుంది కాబోలు. కన్నప్పటికీ అనుబంధం లేకపోతే....' ఇంక ఆలోచించలేకపోయాడు డాక్టరు. అతడి కళ్ళు చెమ్మగిల్లాయి'

'అబ్బిగా. తొందర పడకు. అవ్వకు ఐదు వందలు ఇచ్చాను. సుఖంగా ఉందట. డ్రైవరు వచ్చాడు.'

'నేను అవ్వను చూడాలి' ఏడుపు ముఖం పెట్టాడు.

'అవ్వను ఇక్కడికే పిలిపిస్తాను. ఈ డాక్టరమ్మ బిస్కెట్లు తెచ్చింది. తీసుకుతిను'

అబ్బిగాడు ఆమె ఇచ్చిన పాకెట్ తీసుకుని దగ్గర పెట్టుకున్నాడు.

వాడు సంతోషంతో అందరిలా తింటుంటే చూడాలని ఆమె ఆశపడ్డది. ఆమె అబ్బిగాడి వంక ఒకసారి చూచి ఆగిపోయింది. వాడిని అణువణువూ పరిశీలనగా చూసి వణికి పోయింది. సుధీర్ చెప్పిన పుట్టుమచ్చ—ఆవిశాల నయనాలు-ఆచిన్న నోరు... చూసి నందూ అంటూ చేతులుచాపి వాడిని గుండెకు హత్తుకోవాలనిపించింది. తన నందూ ఇక్కడున్నాడా? ఈ హాస్పిటల్లో? ఆమెకు కాళ్ళ కింద భూమి కదిలిపోతున్నట్లనిపించింది. కడుపులో పేగులు కదిలిపోతున్నాయి.

వార్డులో ఉన్నవాళ్ళందరూ అబ్బిగాడిని చూసి అసూయ పడుతున్నారు- డాక్టరమ్మ అబ్బిగాడి మంచం దగ్గర అంతసేపు ఉండటమేమిటని.

అబ్బిగాడికి కనబడితే అవ్వకావాలంటున్నాడని వాడు నిదపోతున్న సమయంలో సుధీర్ సుమిత్రతో కూడా వచ్చి చూసిపోతున్నాడు.

ఈ ఇరవై రోజులలో సుధీర్ ఇంట్లో ఎన్నో మార్పులు జరిగాయి. అబ్బిగాడికోగదీ, మంచం పరుపూ బట్టలబీరువా అమర్చబడ్డాయి. ఆ గది పక్కనే ఉన్న వరండాలో సైకిలు, రైలు, మోటారు కార్లు, రోబర్టు, బొమ్మల పుస్తకాలు- ఇంకా ఆ ఈడు పిల్లలకు పనికొచ్చే వస్తుసామగ్రి కొని పెట్టింది సుమిత్ర.

ఒక నర్సరీ స్కూల్లో సీటుకు ఏర్పాటు చేశాడు సుధీర్.

సరిగ్గా మధ్యాహ్నం పన్నెండు గంటలవేళ సుధీర్ అబ్బిగాడితో కారు దిగాడు.

అబ్బిగాడు వాకర్‌తో మెల్లగా నడుస్తూ ఇల్లంతా తిరిగి 'అయ్యగారూ అవ్వ వచ్చిందన్నారు ఎక్కడుంది?' గోడ కానుకొని నిలబడి అడిగాడు.

'బట్టలు తెచ్చుకుంటానని వెళ్ళింది. వస్తుంది'

సుమిత్ర స్వయంగా వాడికి సాండల్ ఉడ్ సబ్బుతో స్నానం చేయించి కొత్త బట్టలు తొడిగి

తలదువ్వింది. సెంటువాసన వచ్చే పౌడరు వేసింది. కాళ్లకు చిన్న రబ్బరు చెప్పులు తొడిగింది.

అవన్నీ అబ్బిగాడికి సంతోషాన్ని కలిగించ లేదు. అవ్వ అవ్వ అంటున్నాడు.

భోజనాల దగ్గర కబుర్లలో పెట్టి అబ్బిగాడి చేత తినిపించారు ఇద్దరూ చెరొక పక్కాచేరి. భోజనం కాగానే అబ్బిగాడిని గదిలోకి తీసుకెళ్ళి కథలూ కబుర్లూ చెప్పి నిద్రబుచ్చింది సుమిత్ర.

నాలుగు గంటలకు నిద్రలేచిన తరువాత, కాఫీ టిఫిన్లు తీసుకుని, అందరూ లాన్‌లోకి వెళ్లారు. డ్రైవరు సైకిలు మోటారు ఆటసామాన్లు తెచ్చాడు. వాటితో ఆడించటం మొదలుపెట్టారు.

సుధీర్ లోపలికి వెళ్ళి ఫోటోలు ఆల్బంలో పెట్టి తీసుకొచ్చి 'అబ్బిగా నీకీ పేరు బాగాలేదు. నీకు నందగోపాల్ అని పేరుపెడితే బాగుంటుందని డాక్టరమ్మ అంటోంది. నందూ అనిపిలిస్తే పలుకుతావా?' అని అడిగాడు కుర్చీలో వాడికి పక్కగా కూర్చుని.

'ఊఁహూఁ అవ్వ ఆపేరు పిలవలేదు. దానికి అబ్బిగా అని పిలవటమే ఇష్టం' అన్నాడు మూతి ముడుచుకుని

'పోనీలే గాని- ఈ ఫోటో చూడు దీనిలో ఎవరున్నారు? చెప్పుచూద్దాం?'

వాడి ముఖంలో గుర్తుపట్టిన చిహ్నాలు కనిపించాయి.

'ఎవరు? పేరుచెప్పు?'

'అబ్బిగాడు'

"ఈ ఫోటోలో ఎవరున్నారోగుర్తుపట్టగలవా?'

అది సుమిత్ర ఊరికి వెళ్ళేడప్పుడు తను తీసిన ఫోటో నందూని పక్కన కూర్చోబెట్టుకుంది.

కొంతసేపటికి 'డాక్టరమ్మ' అన్నాడు.

పక్కనున్న వాడెవరు?'

'తెలియదయ్యా'

'బాగా చూడు అబ్బిగాడు కదూ?'

నేనా? కాదయ్యా మంచి బట్టలూ కాళ్లకు బూట్లూ దొరబాబు లాగుంటే అబ్బిగాడంటా రేమయ్యా?'

'నీవు మర్చిపోయావు. నీకు జ్ఞాపకం రావటం లేదు. బాగా చూడు. అబ్బిగాడే' అన్నాడు డాక్టరు ఆశా భావంతో.

"ఆడు అబ్బిగాడయితే అవ్వేది? అదెప్పుడూ నా పక్కనే ఉంటది అయ్యగారూ.'

సుధీర్ సుమిత్రలు హతాశులై ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

డ్రైవరు యజమానులు పడుతున్నబాధను అర్థం చేసుకున్నాడు. మొదటి నుంచీ అబ్బిగాడినీ వాళ్ళిద్దరినీ గమనిస్తూనే ఉన్నాడు. వాళ్ళ బాధ వెనక ఉన్న కథ అర్థమవుతున్నది.

అబ్బిగాడిని సైకిలెక్కించి పక్కయింటికి తీసుకెళ్ళి 'ఈ పాపతో ఆడుకుంటావా? ఈపాపకు వాళ్ళమ్మి బిస్కెట్లు తెచ్చియిస్తోంది చూడు" అంటూ అబ్బిగాడి ముఖంలోకి చూశాడు.

అబ్బిగాడి కళ్ళు ఓరగా చూశాయి. వాడి కళ్లల్లో అవ్వ మెదిలింది.

అబ్బిగాడు హాస్పిటల్‌నుంచి వచ్చినప్పటి నుంచీ సుధీర్ సుమిత్రలు అబ్బిగాడిని మధ్య కూర్చొబెట్టుకుని కాఫీ టిఫిన్ తీసుకుంటున్నారు.

అబ్బిగాడితో ఆమె టాటా అనిపిస్తే గాని సుధీర్ కారు కదలటంలేదు. వాడి కిష్టంలేకపోయినా ఆమె బలవంతంగా వాడి చెయ్యి పట్టుకుని ఊపిస్తోంది.

అబ్బిగాడు దిగాలు పడి కూర్చుంటాడు. వాడి ముఖంలో సంతోషం కనబడటంలేదు. సుమిత్ర ఎంత ప్రయత్నించినా లాభం కనబడటం లేదు. ఆమె మనసు కలవరపడుతున్నది.

ఆ రోజు మధ్యాహ్నం భోజనాలకు కూర్చున్నప్పుడు అబ్బిగాడు పళ్ళెంలో చెయ్యిపెట్టుకుని కూర్చున్నాడు.

'చేత్తో తీసుకుని నోట్లోపెట్టుకో. తినిచూడు. ఆకూర ఎంతోబాగుంది. ఆమ్లెట్ తిను.పోనీ పులుసులో ములక్కాడలు తిను బాగుంటాయి' సుమిత్ర అబ్బిగాడి చేత బలవంతంగా తినిపించింది.

"భోజన మయిన తరువాత అరటిపండు తినాలి' చేతికిస్తూ; నీవు తింటావుకదూ?' అంది.

'ఊఁహూఁ' లేచి చెయ్యి కడుక్కున్నాడు.

ఇంక అమె బలవంతంచెయ్యలేదు.'క్రమంగా అలవాటు కావాలి' అని సర్దుకుంది.

ఆ రోజు వాడు రైలుబండి నడపలేదు. సైకి లెక్కలేదు.రాత్రిబొమ్మలకు కీ ఇవ్వలేదు.రాత్రిబల వంతంగా పాలుతాగాడు. పక్కమీదపడుకున్నాడు.

అబ్బిగాడిని పలకరించకుండా ఉంటే నిద్రపోతాడని సుధీర్ సుమిత్ర లనుకున్నారు. మధ్యమధ్య లేచి వాడిని చూస్తూనే ఉన్నారు.తెల్లవారు ఝాముున పాలపట్టి లోపలపెట్టి బద్ధకంగా సుమిత్ర కళ్ళు మూసింది.

ఆరు గంటలకు కాఫీ కప్పులతో సుమిత్ర పైకి వచ్చేసరికి అబ్బిగాడి మంచం ఖాళీగా ఉంది.

సుమిత్ర గాబరాపడుతూ సుధీర్‌ను లేపింది. ఇద్దరూ కలిసి గదులూ బాత్‌రూములూ వెతికారు.

సుమిత్రకు ఏడుపు ముంచు కొచ్చింది

సుధీర్ ఫొటోలతో పోలీసుస్టేషన్‌కి వెళ్ళి రిపోర్టు చేశాడు. పాచి ముఖంతోనే గుడిసెలన్నీ తిరిగాడు.

అవ్వలేదు. అబ్బిగాడు కనబడలేదు.

నౌకర్లు సందులూ గొందులూ వెతుకుతున్నారు.

బిచ్చగాళ్ళు ఉండే చోట్లన్నీ గాలిస్తున్నారు.

సుమిత్ర అబ్బిగాడు విడిచిన షర్టు చేత్తో పట్టుకుని నట్టింట చతికిలబడ్డది కన్నీటితో.

సుధీర్ రైల్వే స్టేషను బస్టాండు చుట్టూ కారాపకుండా తిరుగుతున్నాడు. 'ఇంతలోకే వీళ్ళెటు మాయమయ్యారూ!'-అనుకుంటూ.

# మందార మాల

## శాసన పరిశోధన ప్రవీణులు శ్రీ బి. ఎన్. శా

లోకంలో అధిక సంఖ్యాకులైన వ్యక్తులు తాముచేసే కార్యక్రమాలను ఇతరులు గుర్తించాలనీ, ప్రశంసించాలనీ, కీర్తి ప్రతిష్ఠలు చేకూరాలనీ ఆశిస్తూ ఉంటారు. అందుకై ప్రయత్నం కూడా చేస్తుంటారు. ఈ విషయంలో రచయితలూ కళాకారులూ మరీ అధికం అయితే ఇందుకు అపవాదంగా ఉండే వ్యక్తులు లేకపోలేదు. కాని వారి సంఖ్య అత్యల్పం. అలాంటివారు తమ కృషిని పవిత్ర కర్తవ్యంగా భావించి, కీర్తి ప్రతిష్ఠలను ఆశించకుండా కృషిసాగిస్తుంటారు. అలాంటివారిలో శ్రీ ఎన్. శాస్త్రి ప్రథమగణ్యులు.

బి ఎన్. శాస్త్రి గారి పూర్తిపేరు బిన్నూరి నరసింహశాస్త్రి, వీరు నల్లగొండజిల్లా, రామన్నపేట తాలుకా నలగొండ గ్రామంలో 1933 సం॥లో జన్మించారు. శాస్త్రిగారు ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి తెలుగులో ఎం ఎ. పట్టా పుచ్చుకొని 1952 నుండి 61 వరకు హైదాబాదు నగరమునందలి దారుల్ఉలామ్, సుల్తాన్ బజారు, గోషామహల్ పాఠశాలలలో ఉపాధ్యాయులుగా పనిచేసి తరువాత ఉద్యోగానికి స్వస్తి చెప్పి స్వతంత్ర జీవనం సాగిస్తూ నిరంతర శాసన పరిశోధనలోనూ, రచనా వ్యాసంగంలోనూ నిమగ్నులైనారు.

శాస్త్రిగారు మొదటినుండి సరళమైన వృత్తీ, సరసమైన ప్రవృత్తీ కలిగి, మనసు వెన్నగా, మాట మన్నన తిన్నగా అందరి హృదయాలను ఆకట్టుకుంటూ నిరాడంబరమూ, నిష్కపటమూ అయిన వ్యక్తిత్వం రూపు గట్టిన వారు. యథా శక్తి ఇతరులకు సాయ పడుతూ సాహితీ బంధువుగా, సహృదయులుగా, సద్గుణ నిలయులుగా స్నేహశీలగా నడవడిని తీర్చిదిద్దుకున్నవారు.

ఉపాధ్యాయవృత్తిని వదలిన పిదప శాస్త్రిగారు ప్రజ్ఞాచక్షువుని విప్పి రచనా వ్యాసంగమునూ, శాసన పరిశోధననూ చేపట్టి అవిశ్రాంతిగా పరిశ్రమిస్తూ కర్మయోగియై కాలాన్నీ, జీవితాన్నీ సద్వినియోగపరుస్తూ వున్నారు. నిరంతరంగా, నిరంతరాయముగా శాసనపరిశోధన కార్యక్రమాన్ని సాగిస్తూ ఆంధ్రదేశ చరిత్రపై క్రొత్త వెలుగును వెలయించారు. ముఖ్యంగా విష్ణుకుండినలపై శాస్త్రిగారు శాసన పరిశీలద్వారా ప్రకటించిన నూతనాంశాలు పలువురి ప్రశంసలకు పాత్రమై భాసిల్లినవి. విష్ణుకుండినుల చరిత్రాంశాలను ఆధారంగా చేసుకొని 'వాకాటక మహాదేవి' అనే నవల కూడా వ్రాశారు

బి.ఎన్. శాస్త్రిగారు శిలాఖండములపై చిలికిపోతున్న వందల కొలది. శాసనాలకు వెలికితీసి,

వెలుగు చూపించి, తెలుగు చరిత్రకు వన్నె చిన్నెలు దిద్దారు. శాస్త్రిగారు ప్రకటించిన శాసన సంపుటాలు ఈ దిగువ పేర్కొనబడుతున్నవి.

'శాసన సంపుటి, 2. త్రిపురాంతక శాసనములు, 3. కందుకూరి చోడుల చరిత్ర శాసనములు, 4. ముఖలింగ దేవాలయ శాసనములు. దేవాలయ శాసనాలు ప్రకటించే సందర్భంలో శాసన విషయాలేకాక దేవాలయ చరిత్రను కూడా వివరించచడం శాస్త్రిగారి ప్రత్యేకత. ఉదాహరణకు త్రిపురాంతక శాసన సంపుటి చూడవచ్చును. ఇందు త్రిపురాంతక దేవాలయ చరిత్రను గూర్చి తెలుపడమే కాక దేవాలయపు ఫోటోలు కూడా చూపడం జరిగింది. శాస్త్రిగారు అప్రకటితములైన అమూల్యములైన శాసనాలెన్నో ప్రకటించి ఆంధ్రదేశ చరిత్రకు ఎనలేని ఉపకారం చేశారు. అంతేకాక కందుకూరి శాసన సంపుటిలో చోడుల కాలం నాటి సాంఘిక పరిస్థితులను వివరించి ఎంతో మేలు చేశారు.

శాస్త్రిగారు చేసిన ఒక గొప్ప కార్యం నల్లగొండ మండల సర్వస్వాన్ని ప్రకటించడం. ఈ సర్వస్వం దాదాపు 900పుటల గ్రంథం. ఇందులో నల్లగొండ జిల్లాలోని చరిత్ర, సంస్కృతి, శాసనాలు, సాహిత్యం, గ్రామ విశేషాలు, ప్రజా సంక్షేమాది అభివృద్ధి కార్యక్రమాలు మొదలైన అనేక విషయాలు ఉన్నాయి. ఇందులో ఎన్నో ఫోటోలు, శాసన ప్రతిబింబాలు చూపబడినాయి. ఆయా విషయాలను సేకరించడంలో శాస్త్రిగారు ఎందరో తజ్ఞుల సహకారాన్ని తీసుకోవడం జరిగింది. అయినా ఇంతటి మహాకార్యాన్ని నిర్విఘ్నంగా, సమగ్రంగా సాగించడం సామాన్య విషయంకాదు. శాస్త్రిగారిలాంటి కొద్ది మంది కార్యసాధకులకు మాత్రమే అలవి అయ్యేవని.

శ్రీ బి ఎన్. శాస్త్రి శాసన పరిశోధకులే కాక ఉత్తమ రచయితగా కూడా వాసిగాంచారు. వారు నవలలు, నాటకాలు, బాలసాహిత్యం మొదలైన వివిధ ప్రక్రియలలో రచనలు చేసి ఆంధ్ర సరస్వతికి ఉజ్జ్వలములైన ఉడుగరలు అందించారు. నవలలు:-రాధ, జీవన పథం సంధ్యారాగం, పరివర్తన, తుక్కాదేవి, జీవితం-గమనం, వాకాటక మహాదేవి, విప్లవజ్వాల, వీటిలో తుక్కాదేవి,వాకాటక మహాదేవి అనే నవలలు చారిత్రకాలు. 'విప్లవజ్వాల' నవల స్వాతంత్ర్య సమరానికి సంబంధించినది. ఆనాటి స్వాతంత్ర్యపు పోరాటపు అంశాలను కన్నులకు కట్టినట్లుగా చిత్రించారు. 'వాకాటక మహాదేవి విష్ణుకుండినుల వంశచరిత్రాంశాలతో కూర్చిన గొప్ప నవల. ఇందులోని పాత్ర చిత్రణ, సంఘటనా సంవిధానం, సంభాషణచాతుర్యం శాస్త్రి గారి రచనా శక్తికి గీటురాళ్ళుగా ఉన్నాయి.

కిరాయిదార్, సహకారం, గ్రామజీవనం శాస్త్రి గారి నాటకాలు.

శాస్త్రిగారు తాము సంతరించిన గ్రంథాలను కొన్నింటిని కొందరు మహనీయులకు ఫలాపేక్ష రహితంగా అంకితం చేశారు.
త్రిపురాంతక దేవాలయ శాసన సంపుటిని శృంగేరి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ విద్యా నృసింహ భారతీ స్వామి వారికి, కందుకూరి చోడుల శాసన సంపుటిని ఆంధ్రపత్రికాధిపతి స్వర్గీయ శివలెంక శంభు ప్రసాద్‌గారికి, బెజవాడ దుర్గమల్లేశ్వరాలయ శాసన సంపుటిని శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి, కాటక మహాదేవి నవలను స్వాతంత్ర్య సమర యోధులు శ్రీ పులిజాల. వెంకట రంగారావుగారికి, విప్లవజాల వెంకటరంగారావు గారికి, విప్లవ జ్వాల నవలను తెలంగాణా విముక్తి సమరయోధులు శ్రీ రావి నారాయణ రెడ్డిగారికి అంకితం చేశారు.

ప్రస్తుతం శాస్త్రిగారు కూర్చిన అమూల్య గ్రంథాలు రేచేర్లరెడ్డి వంశ చరిత్ర-శాసనాలు, గోలకొండ చరిత్ర-సంస్కృతి-శాసనాలు, చెరకు రెడ్డి వంశీయుల చరిత్ర-శాసనాలు, ఆంధ్రదేశ చరిత్ర-సంస్కృతి ముద్రణలో ఉన్నాయి. శాస్త్రి గారు తలపెట్టిన మరొక మహాకార్యం భారతదేశ చరిత్రనూ, సంస్కృతినీ తెలిపే ఉద్గ్రంథాన్ని పదిసంపుటాలతో ప్రచురించడం. ఒక్కొక్క సంపుటం 1000 పేజీలు ఉంటుంది. ఈ సంపుటి పరంపరలో ప్రస్తుతం వేదకాల భారతదేశ చరిత్ర పూర్తి చేయబడి ప్రచురణకు సిద్ధంగా ఉన్నది. మన సంస్కృతిచరిత్ర పూర్తి చేయబడి ప్రచురణకు సిద్ధంగా ఉన్నది మనసంస్కృతి-చరిత్ర, శ్రీనాథభారతము, సెమినారులో సమర్పించిన వ్యాసాలు ఉన్నాయి

ఈవిధంగా బి. ఎన్ శాస్త్రిగారు ఉత్తమ విషయోదాత్తములైన బృహద్గ్రంథాలను సంతరించడమే కాక ప్రచురించడం నిజంగాఅపూర్వమూ అద్భుతమూ, అనుపమానమూ అయిన సంగతి. ఈలాంటి గ్రంథరచన, ప్రచురణ ఒక్కచేతి మీదుగా సాగించడం శాస్త్రిగారి దక్షతకూ, దీక్షకూ, ప్రతిభకూ నిదర్శనం. శాస్త్రిగారు 'మూసీ' అనే సాహిత్య సాంస్కృతిక మాసపత్రికను ప్రకటించడం జరిగింది. 'కాకతీయ పబ్లికేషన్సు' పేరుతో ప్రచురణ సంస్థను నెలకొల్పి 'మల్లభూపాలీయము' 'క్రీడాభిరామము' మొదలైన ప్రాచీనకావ్యాలను ప్రచురిస్తూ సారస్వత సేవ చేస్తున్నారు.

ఈ విధంగా బహుముఖాలుగా పరిశోధన, రచనాకృషిని సాగిస్తూ ఆంధ్రచరిత్రకూ, సాహిత్యానికి అనల్పమైన సేవచేస్తున్నందుకు శ్రీ-బి.ఎన్. శాస్త్రిగారు మిక్కిలి అభినందనీయులు. శ్లాఘా పాత్రులు.

వేముగంటి నరసింహాచార్యులు
సిద్ధిపేట మెదక్ జిల్లా.

# నేత్రోదయం- వస్తు, భావ, శైలి నవ్యత

నేత్రోదయంలోని కవితలు సమకాలీన సమాజమే భూమికగా తీసుకొని రచింపబడ్డాయి. చాలా మంది కవిత్వం చదువుతుంటే కవిత్వం మీదికంటే కవి మీదనే మన దృష్టి కేంద్రీకృతమవుతుంది. కొందరి కవిత్వం చదువుతుంటే కవి నేపథ్యంలో సూత్రధారిగా ఉంటాడు. వారి కవిత్వంfore front లో ఉంటుంది. చెన్నప్పగారి కవితలుచదువుతుంటే వారెవరో మనకు తెలియదు. వారి కవితలు మాత్రం మనల్ని కదిలిస్తాయి.

భావ చిత్రాలకంటే ఊహల గారడీల కంటే చెప్పదలచుకున్న వస్తువుకు ప్రాధాన్యం ఇచ్చే వస్తు నిబద్ధతా దృష్టి చెన్నప్పది. కవిత్వం వస్తునిబద్ధంగా రాసినప్పుడు పాఠకుని మనస్సు వస్తువును ఆశ్రయిస్తుంది. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొనే సి నారె నేత్రోదయం పీఠికలో చెన్నప్పను విషయజ్ఞుడైన కవిగా పేర్కొన్నారు.

చెన్నప్పగారు నేత్రోదయం అని ఈ కవితా సంకలనానికి పేరు పెట్టడంలోనే ఎంతో ఔచిత్యాన్ని ప్రదర్శించారు. నేత్రోదయం అంటే కనువిప్పు అని సామాన్యార్థం. వెంటనే జ్ఞానోదయం అనే అంతరార్థం స్ఫురిస్తుంది. కవితా సంకలనం కవరు పేజీ మీద సూర్యోదయాన్ని డిజైన్‌గా చూపించడం వల్ల నేత్రానికి సూర్యునికి అభేదం చెప్పినట్లయింది సూర్యచంద్రుల నేత్రాలతో పోల్చడం సంప్రదాయమే సంప్రదాయార్థాన్ని ధ్వని గర్భితంగా(వ్యంగ్యంగా) ప్రదర్శించడం. నవ్యత కాక ఏమవుతుంది.

ఈ కవితాసంకలనంలో 38 కవితలున్నాయి. ఇవన్నీ సామాజిక స్పృహకు అలవాలమైనవి. ఇందలి వస్తు భావ, శైలీ నవ్యతలను పరిశీలిద్దాం.

## వస్తునవ్యత :-

ఈ రోజుల్లో ఏ కవితను పరిశీలించినా వస్తు నిబద్ధత కంటే భావచిత్రాలమీదనే కవులకు దృష్టి ఉన్నట్లు కనిపిస్తుంది. కానీ వస్తువుకు ఉద్దీపనం కలిగించడానికి మాత్రమే భావచిత్రాలను వేస్తే ఆ కవితా వస్తువును పాఠకుడు ఎక్కువకాలం మనస్సులో ముద్రించుకొనే అవకాశం ఉంటుంది. చెన్నప్పది వస్తుపరమైన సృష్టి. ఈ సంకలనంలోని క్యాలెండర్, బస్తీ, పీఠాధిపతి, విశ్వవిలాపం మొదలైన కవితల్లో వస్తువు పాఠకుణ్ణి ఎక్కువగా ఆకర్షిస్తుంది. కారణమేమంటే ఆ వస్తువు నిత్య జీవితానికి సన్నిహితమైనదిగా ఉండడం. ఈ కవి ఏ విషయాన్ని కవితగా రూపెత్తిస్తాడో దాన్ని అన్ని కోణాల నుంచి ముందుగానే పరిశీలిస్తాడు వస్తువుకు తన వ్యక్తిత్వానికి సమన్వయం కుదిరినప్పుడే దాన్ని కవితగా మలచుతాడు. 'బస్తీ'ని గురించి కవి రాసిన పంక్తులు చూడండి—

'ఇదండీ బస్తీ
ఇక్కడ జనం జాస్తీ
బతుకులో కుస్తీ
దోమలతో దోస్తీ

మన ప్రత్యక్షానుభవంలోని బస్తీని కేవలం నాలుగు చిన్న చిన్న పాదాల్లో చెప్పడం. వస్తువు పట్ల కవికి గల సంపూర్ణావగాహనను వ్యక్తం చేస్తుంది. ఇట్లే 'పీఠాధిపతి' అనే ఖండికలో రాజకీయ నాయకుణ్ణి ఉద్దేశించి ఇలా అంటారు—

'పంచవర్ష ప్రణాళిక లాంటి
ఐదేళ్ళ పదవీ కాలాన్ని
అస్మదీయులకే
అంకితం చేస్తావా?'

పంచవర్ష ప్రణాళికలు దేశ భవిష్యత్తును నిర్ణయించేవి. ఇవి సుమారు ఐదేళ్ళ పరిమితిని కలిగి ఉంటాయి. ఎన్నికల్లో గెలిచిన నాయకుని పదవీ కాలం కూడా సుమారు అయిదేళ్ళే. పదవీ కాలాన్ని ప్రణాళికా కాలంతో పోల్చడం వల్ల అసలు ప్రణాళికలనేవి దేశ ప్రగతికా? లేక నాయకులూ వారి వారి అనుయాయుల అభివృద్ధికా అన్న ప్రశ్నార్థక వ్యంగ్యం స్ఫురిస్తుంది.

సమాజంలో రోజు రోజుకి దౌర్జన్యాలూ, మోసాలూ, మితి మీరి పోతున్నాయి. చీకటి మార్కెట్టులో మాత్రమే నిత్యావసర వస్తువులు లభిస్తున్నాయి. ఒకవైపున విజ్ఞానశాస్త్రాభివృద్ధి ఎంతగా జరిగినప్పటికీ మరోవైపున అజ్ఞానం అంధకారంలా ప్రపంచాన్ని ఆవరించి ఉండటం కవి హృదయాన్ని గాయ పరిచింది. అందుకే వారు దీప కవిత' అనేఖండికలో ఇలా అన్నారు—

'టక్కుల మారి లోకాన్ని
టపాకాయలు మారుస్తాయా!
అంధకార కుడ్యాలను
ఆటంబాంబులు కూలుస్తాయా?'

ఏడాదికోసారి వచ్చే దీపావళి ఏ కొందరి జీవితాల్లోనో వెలుగులు నింపుతుంది తప్ప చాలా మంది బ్రతుకుల్లో కనిపించని చీకటి పొరలుంటాయనీ, కేవలం దీపావళినాడు మాత్రమే కాల్చే టపాకాయలూ, ఆటంబాంబులూ, లోకాన్ని మార్చలేవనీ, చీకటి గోడల్ని కూల్చలేవనీ చెప్పిన మాటలు యదార్థమైనవి.

మన కీనాడున్న సమస్యల్లో కాలుష్య సమస్య ఒకటి. ఈ సమస్య మీద కవితలు రాసినవారు తక్కువ. ప్రత్యేకంగా ఈ సమస్య

మీద కవిత రాయడం విశేషం. ప్రతి మనిషీ ఏదో విధంగా అనునిత్యం. కాలుష్యంతో సతమతమవుతూనే ఉన్నాడు. ఈ సమస్యకు స్పందించిన చెన్నప్ప 'పర్యావరణాన్ని రక్షించండి, పదికాలాల పాటు జీవించండి' అని ప్రబోధిస్తాడు. అంతేకాక కాలుష్యాన్ని అరికట్టవలసిన సంబంధిత నాయకులు ఏ చర్యలూ తీసుకోకుండా నిమ్మకు నీరెత్తి ఉండడం కవికి ఆవేశాన్ని తెప్పించింది.

అందుకే కవి—

'పరిసరాలు కన్నెత్తి చూడని మీకు
పర్యావరణ శాఖలో పదవులా'?

అని గర్జిస్తాడు.

**భావ నవ్యత :**

మనకు తెలిసిన పదాల ద్వారా సన్నిహితమైన వస్తువు ద్వారా కవి భావనవ్యతను సాధిస్తాడు. ఈ కవితా సంకలనంలోని క్యాలెండర్, నాలాగే, వెన్నెల, ఆ క్షణం కోసం, ముద్రలు మొదలైన ఖండికలు భావనవ్యతకు గీటురాళ్ళు.

క్యాలెండర్ లోని వస్తువు కాలానికి సంబంధించినది. ఏడాదికోసారి క్యాలెండర్‌ను మార్చినా కాలంతోపాటు జ్ఞాపకాలు వెన్నంటి ఉండడం సహజం. కవి కాలాన్ని క్యాలెండర్ కంటి నుండి జారే కన్నీటితో పోల్చడం ఒక కొత్త భావన. కన్నీటిని ఎంత కార్చినా అది ఇంకా మిగిలే ఉంటుంది. క్యాలెండర్ ఒక సంవత్సరానికే పరిమితమైనా కాలం యొక్క వయస్సు అనంతం. కాలాన్ని మనం సంవత్సరాలుగా, నెలలుగా, వారాలుగా రోజులుగా, గంటలు నిమిషాలుగా విభాగిస్తాము. గతంలోకి వెళ్ళిపోయే కాలాన్ని కన్నీటితో పోల్చడంలో కవి భావనాశక్తి ప్రత్యక్ష మవుతుంది.

'...కాని మనకు తెలియదు
క్యాలెండర్ వెన్నంటే వుంటుందని
కాలం దానికి కన్నీరని'

ఇలాగే 'నాలాగే'అన్నకవిత కవికీ ప్రకృతికీ ఉన్న సమన్వయానికి ప్రతీక. కవి మబ్బై ప్రేమను వర్షించడం, సూర్యుడై మమతను ప్రసరించడం, చెట్టై మాధుర్యాన్ని అందించడం ఇవన్నీ ఒకఎత్తు కాగా ఈ క్రింది పంక్తులు మరొక ఎత్తు.

'కోకిల నా ప్రేయసి
నా లాగే పాడుతుంది జీవితాన్ని'

వగరు చిగురులు మేసినప్పటికీ కోకిలకోసం లోకం తియ్యగా పాడుతుంది. సుఖదుఃఖాలతో కూడుకొన్న జీవితాన్ని అనుభవించిన కవి విషాదంగా కాక కోకిల లాగా తియ్యగా జీవితాన్ని గూర్చి పాడాలని పై పంక్తుల్లోని భావం. సి.నా.రె. అన్నట్లు ఇది లోతైన భావన.

కవి వెన్నెలను ఐస్‌క్రీమ్‌తో పోల్చడం నూతన భావావిష్కారానికి ప్రబల నిదర్శనం.

"వెన్నెల ఐస్‌క్రీమ్'
ఎంత తిన్నా రుచి తగ్గదు'

ఇట్లే

'సజ్జరొట్టెకు
పూసిన వెన్నెల' అంటారు కవి.

సాధారణంగా గ్రామాలలో వ్యవసాయదారుల కుటుంబాలలోని చిన్నపిల్లలు సజ్జరొట్టెకు వెన్న పూసుకొని తింటారు. వెన్న వెన్నెల అయినప్పుడు సజ్జరొట్టె చంద్రుణ్ణి స్ఫురింప చేస్తుంది.

'ముద్రలు' అనే ఖండకలో కవి బహుశా ఇంతకు ముందెవరూ, ఆవిష్కరించని కొత్త భావాన్ని ఆవిష్కరించినట్లు తోస్తుంది.

'అప్పుడప్పుడు కాలం తెగుతుంది
కత్తెరలో చిక్కుకొని'

ఇందులో కాలం, కత్తెర, అనే రెండు పదాలు విశేషార్థాన్ని స్ఫురింపచేస్తున్నాయి. కాలం జీవితానికీ, కత్తెర ఆ యా సమస్యలకూ సంకేతాలు.

**శైలీ నవ్యత :**

పద్యంగానీ గేయంగానీ గాన యోగ్యాలైన ప్రక్రియలు. వచన కవితకు సంపూర్ణంగా గేయ గుణం లేదు. చాలా మంది నవ్యకవుల వచన కవితల్ని పరిశీలిస్తే అవి చదవడానికి మాత్రమే అనుకూలంగా ఉంటాయి తప్ప గాన యోగ్యం కావు. తిలక్, సి. నా.రె. శేషేంద్ర వచన కవితలను కొంత వరకు పాడుకోవచ్చు. నేత్రోదయంలోని కవితలు కేవలం చదువుకోవడానికే కాక మౌనంగా, ఆవేశంగా, పాడుకోవడానికి వీలైనవి. ఉదాహరణకు, 'అతిథి' అనే ఖండికలోని పంక్తుల్ని పరిశీలించండి—

'కవి పుత్రుని కలంలోకి
భావ మొకటి వచ్చింది
అభ్యుదయ గీతంలో
అక్షరమై వెలిగింది'

'Style is Manner' అన్నారు విమర్శకులు. చెన్నప్పగారి వ్యక్తిత్వం లాగానే వారి శైలి సరళ సుందరమైనది. వారికి పద్య విద్య తెలుసు, భావాను గుణమైన పదజాలాన్ని వాడడంలోనూ పాదాలను శ్రవణ పేయంగా రచించడంలోనూ తమ సామర్థ్యాన్ని నిరూపించుకున్నారు. ఒకపాదం మూరెడు, ఒకపాదం జానెడు అన్నట్లు కాక భావాన్ని శిల్పాకృతి ధరించేటట్టు చేయడం, పాదాల మధ్య సమతూకాన్ని సాధించి లయాత్మకంగా మార్చడం వారి ప్రత్యేకతలు. వస్తువును మరుగుపరిచే శైలి కాదు వారిది.

నాటి నేటి కవులకు
నా ప్రశంస తప్పదు
పునాది లేని గోపురాన్ని
పుడమి తల్లి ఒప్పదు,.

ఆవేశంగా పాడుకోవడానికి వీలైన లయకు ఎన్నో కవితా పంక్తుల్ని ఉదాహరణంగా చూపొచ్చు.

'నాగజముదు కనిపిస్తే
నా కేమో వొళ్ళుమంట'

సాధారణంగా పద్యకవులు పాటించే యతి ప్రాసలు వీరి కవిత్వంలో చూడొచ్చు.అక్కడక్కడ అంత్యప్రాసలు కవితకు అందాన్ని చేకూరుస్తాయి.

'కవిత్వమంటే కాదు మజాకా
దానితత్వం అందదు చివరిదాకా'

నేత్రోదయం, శాంతిగీతం మొదలైన కవితా ఖండికలు శైలీరమ్యతకు చక్కని ఉదాహరణలుగా చెప్పవచ్చు. వీరి శైలి భావానుగుణమై చదివినంతనే జ్ఞాపకం పెట్టుకొనే అవకాశం కలిగిస్తుంది, పాఠకులకు.

"ఒక్కరోజు దీపావళి
వొద్దని నే గర్జిస్తా
కాలమంత శోభావళి
కావాలని అర్థిస్తా"

**అలంకార నవ్యత :**

ఎప్పటికప్పుడు కొత్త కొత్త భావాలతో పాటు కొత్త కొత్త అలంకారాలను చెప్పడం నవనవోన్మేష శాలియైన కవికి తప్పదు. ఈ కవితా సంపుటిలో కవి చమత్కారవంతమైన ప్రయోగాలు ఎన్నో చేశాడు. వాటిలో "మాసిన గడ్డం లాంటి చీకటి", వెన్నెల ఐస్‌క్రీమ్ మొదలైనవి కొన్ని నేటివిటికి దగ్గరగా ఉన్న సరికొత్త ప్రయోగాలు చెన్నప్ప చెప్పాడు.

"ఆవేశం మండుతున్న పెనం
ఆలోచన మాడుతున్న రొట్టె"

ఇక్కడే "పంచవర్ష ప్రణాళిక లాంటి ఐదేళ్ళ పదవీకాలం" వ్యంగ్య స్ఫోరకమైన అలంకారం.

సాహిత్యపు అస్తిత్వానికి రచయిత,పాఠకుడు ఈ ఉభయుల సమిష్టి ప్రయత్నం అవసరం. కళాసృష్టి ఏక పక్షంగా ఉండక,పాఠకుడు చదివేటప్పుడు తన ఆత్మీయత ద్వారా రచనకు అస్తిత్వం ఇస్తాడు. పాఠకుడు తనలో ఉన్న అనుభూతులనే రచన ద్వారా పొందుతాడు. నేత్రోదయంలోని 'అద్వైతం' అనే మొదటి కవిత పై మాటలను యథార్థం చేస్తున్నది.

ఈ పంక్తులు చూడండి :-

"నువ్వు కఠిన శిలని చీల్చుకొచ్చిన మొక్కవి.
ఆపదల చీకట్లలో వెలిగే చుక్కవి.

అంటూ అట్టడుగు పొరల్ని ఛేదించుకొని అభ్యుదయాన్ని పొందుతున్న వ్యక్తి వ్యక్తిత్వాన్ని కీర్తిస్తాడు కవి. తోటిమనిషిని "నిన్ను నీవు చెక్కుకొన్న శిల్పానివని" పేర్కొంటూ సమాజంలో వ్యక్తి తానుగా ఎదుగవలసిన అవసరాన్ని నొక్కి చెబుతారు.

ఈ కవితా సంపుటిలోని 'పీఠాధిపతి' 'జనంలోకి నాగజెముడు' 'మళ్ళీ వెలిగిన చుక్క' 'కానలేవా బతుకు దారి' 'మళ్లిపో మతరక్కసి' 'విశ్వవిలాపం' మొదలైన ఖండికలు ప్రస్తుత సామాజిక వ్యవస్థకు అద్దంపడుతూ సామాజిక స్పృహను కల్గి ఉన్నాయి

అంతర్జాతీయత కంటె జాతీయతకు, ఊహాల గారడీల కంటే, భావచిత్రాల కంటె వస్తువుకు ప్రాణంపోసిన కవితలు ఈ సంపుటిలో ఎన్నో ఉన్నాయి.

"నా ధర్మం నన్ను కర్మ యోగిని చేస్తున్నది
నా విశ్వాసం నన్ను మనిషిగా చూస్తున్నది"

అన్న కవిమాటలు అతనికి ధర్మంపట్ల, జాతిపట్ల ఉన్న ప్రగాఢ విశ్వాసాన్ని వ్యక్తం చేస్తున్నాయి.

వస్తు నిబద్ధతకూ స్పష్టతకూ, సామాజిక స్పృహకూ, పాఠకనేత్రాలను తన వెంట గొనిపోయే చక్కని శైలికీ చెన్నప్పగారి "నేత్రోదయం" ఒక చక్కని ఉదాహరణ.

ఇం.నెం. 4-1-247
హనుమాన్ టేక్డి, ట్రూప్‌బజార్
హైదరాబాద్-500 001

## పుస్తక సమీక్ష

# 'అలలకు ఓటమి లేదు'
## (వచన కవితా సంపుటి)

తెలుగు కవిత్వాన్ని ఆధునికరించడంలో ఏర్పడదే వచనకవిత్వం, ఈనాటి పరిస్థితులకు అణుగుణంగా మార్పుగా వచనకవి ప్రాధాన్యతతో ప్రచారం పొందటంలో ఒక నియమ నిబంధనలు, హద్దులు లేవు. కవిత్వంలో ఈ ప్రక్రియ గురజాడ, శ్రీశ్రీ వంటి వారు సాహిత్యంరంగంలో ప్రవేశించే వరకు తెలుగులో వచనకవిత్వం ఏమిటో తెలియదు. శ్రీ ఏ. సూర్యప్రకాశ్‌గారి వచనకవితా సంపుటిలో ప్రమాణిక పత్రికల్లో అచ్చువేయబడిన వాటి కూర్పుగా కొన్ని ఆకాశవాణి–హైద్రాబాద్ ద్వారా

| | |
|---|---|
| రచయిత | : ఏ. సూర్యప్రకాశ్ |
| ప్రతులకు | : రచనా పల్లిపర్వ్, 1–7–87, వంత్‌రోడ్డు, ఆర్మూర్–203 224 |
| వెల | : రూ. 7–00 |
| పుటలు | : 65 |

ప్రసారితాలు. వీరు యువసాహిత్య కృషీవలుడుగా భావోన్నతి, పదసౌందర్యాలు, కవితలకు తగ్గపేరు నిర్ణయించడంతోపాటు కవిత ఆరంభంలో నుంచి అంతం వరకు సాగే క్రమపద్ధతి వొరవడితో సాగించారు. కొన్ని మినీకవితలు "పునారావృతం" లో జీవితంలోని సత్యాలు వెల్లడించారు. ఏవరోకాదు'' లో మాతృదేశపుస్థితి తన ఆవేదన అక్షరరూపంలో వచనకవితను నవ్యతతో సాగించారు. వచనకవిత్వ ప్రియులు చదువదగినవి. దీర్ఘ కవితలు 'పువ్వులా విక' కవితాఖండికలో కరుణశ్రీని తలపిస్తున్నాయి. 'పువ్వుల కళేబరాలను చీపురుతో చిమ్మి/పెంటదిబ్బ మీదికి ఈడ్చేస్తున్నది;'అంటూ'; పువ్వులనూ పువ్వుల నవ్వులనూ అమ్మి/సొమ్ము చేసుకొంటున్నది ఆ అమ్మి–.ఆ అమ్మి గతాన్ని, మసిమనుషుల కసి ముద్రలను–స్పష్టపరిచే సున్నితమైన కవిఆవేదన– "దస్పృసంబ్రం।" కవితా ఖండికలో మాండలిక పల్లెపదాలతో, హీన, దీనబ్రతుకులు, వున్నవాడే వారికి వంతగని ప్రబోధిస్తున్నాడు. యింకా "భగీరాత్" "గేట్‌కీపర్" లో ప్రత్యేకతల కన్న "దేశం నీకేమిచ్చింది!" లో సేవాప్రపంచంలోని శ్రామికుల శక్తిని, దేశానికి వెన్నుముకలైన రైతన్నల ఆర్తనాదం కవిగారి నాదంగా శిలాక్షరి, యిలా ఎన్నోవున్నాయి. "అలలకు ఓటమిలేదు" ఈ కవితా ఖండికపైననే పుస్తకనామం బాగుంది. చూడండి.

"అలలకు ఓటమిలేదు
కలలకు ఓటమిలేదు
కళలకు ఓటమిలేదు "

పనికి ఫలితం దక్కుతుంది
నక్షత్రం చెట్టు దిగి వస్తుంది
ఈయుగం శ్రమజీవిది.
కలాలకు ఓటమిలేదు
హలాలకు ఓటమిలేదు
కాలానికి ఓటమిలేదు "

అంతంలేని అలలుగా అనంతమైన భావంతో తన ఆశావాదం–తో సమాజపు చైతన్యానికి శంఖారావం పూరిస్తున్నాడు. ఇది ప్రశంసా కుసుమం

కాదు. ముఖచిత్రం బావుంది. రచనలు యింకాబాగున్నాయి. ఈ కృతిని అంకితమిచ్చిన డా॥ రావూరి భరద్వాజ భావాలకు తగిందే శ్రీ రావూరిభరద్వాజ

''రోధించే రక్తపుటేర్లు—శివమెత్తిన
సముద్రఘూష
కవిత—
ఎగసిపడే ఎడారిగుంపు
కారదవుల కరాళలాస్యం ''

అలాగే రచయితఏ.సూర్యప్రకాశ్ రచనలకు ఓటమిలేదు చదవదగిన సత్తాగల కవితలు.

**కామారపు సురేష్**

## డా॥ కె. వి. యన్. రాఘవన్‌గారి

# విశ్వనాథ : ఆర్థిక వ్యవస్థ

డా॥ కె. వి. యన్. రాఘవన్ గారి పది సంవత్సరాల కృషి వారి పరిశోధనా గ్రంథమైన 'వేయి పడగలు : సమకాలీనత సార్వకాలీనత'. విశ్వనాథ సాహిత్యాన్ని అధ్యయనం చేయడంలో ఒక నూతన మార్గాన్ని నిర్మించినట్లు ఆచార్య సుప్రసన్న అభిప్రాయం. ఈ సిద్ధాంత వ్యాసంలోని కొన్ని అంశాల విశదీకరణ, విస్తరణ యే 'విశ్వనాథ : ఆర్థికవ్యవస్థ' అన్న విలువైన పరిశీలనా గ్రంథం.

చాలా మంది భావిస్తున్నట్లుగా విశ్వనాథ మతం గురించీ దైవం గురించీ సంకుచితమైన రచన చెయ్యలేదు. ఈ ప్రపంచంలోని మానవుని దుఃఖం గురించీ, దానికి కారణాలైన భౌతిక అధి భౌతిక, ఆధ్యాత్మిక అవ్యవస్థలను గురించీ సహస్ర రీతులా విశ్వనాథ ఆవేదన చెందాడు. ఆర్థిక వ్యవస గురించి ఆయన భావన ఏ విధంగా ఉందో రాఘవన్ గారి ఈ పరిశీలనా గ్రంథం విపులమైన విలువైన వివరణను ఇస్తున్నది. ఇందులో అయిదు అధ్యాయాలు ఉన్నవి.

ఈ గ్రంథం మొదటి అధ్యాయంలో విశ్వనాథ సామాజిక చైతన్యం గురించి చర్చిస్తూ సమాజ పునర్నిర్మాణావశ్యకతను, ధర్మానుబంధంగా(మానవుడు సుఖపడే రీతిలో విముక్తుడయ్యే విధంగా) చేపట్టవలసిన ఆ కార్యక్రమాలనీ రాఘవన్ వివరించడం జరిగింది. ముఖ్యంగా గ్రామీణ వ్యవస్థలో స్వయం సమృద్ధి సాధించడం అవసరమనీ, రష్యాలో ఉన్నటువంటి వ్యవస్థ ఇక్కడ స్వేచ్ఛాపూరితంగా నెలకొనాలన్న అభిప్రాయాన్ని వ్యక్త పరచడం విశేషం. ఆచార్య కె. వి. రామకోటి శాస్త్రిగారు 'సంఘం బాగుపడటానికి విశ్వనాథ కపటంలేని కవిగా, సమ్మినదాన్ని దాచుకోక చెప్పే

వెల : 15–00
శ్రీ అరవింద సొసైటి, హనుమకొండ బ్రాంచి
శ్రీ అరవింద మార్గము
కాకతీయ విశ్వవిద్యాలయం ఎదురుగా—విద్యారణ్యపురి
జిల్లా వరంగల్-506 009

నిజాయితీ పరుడుగా సమకాలికులతో కలసి చేసిన దానికంటే ఎక్కువే చేశాడు'' (విమర్శిని 2. సంపాదకీయం. విశ్వనాథ వాఙ్మయ జీవిత విశేష సంచిక. కాకతీయ విశ్వవిద్యాలయం—వరంగల్లు 1977) అని చెప్పడం ద్వారా విశ్వనాథ సంఘ శ్రేయోభిలాష అభివ్యక్తమయింది. ఈ ఆధారాన్ని చూపుతూ సామాజిక చైతన్య చర్చసాగించడం విమర్శకుని ఔచితీ వివేకానికి చిహ్నంగా గుర్తింప వచ్చు. సమకాలీన భావప్రతినిధిగా విశ్వనాథను గురించి సరైన అంచనా వేశాడు రాఘవన్.

రెండో అధ్యాయంలో వ్యావసాయిక వ్యవస్థ గురించీ దానిలో రావలసిన పరిణామాన్ని గురించి విశ్వనాథ విశ్వాసాలనూ, అభిప్రాయాలనూ, తపననూ విశ్లేషించాడు గ్రంథకర్త. ఆంగ్లేయులు పర్మినెంట్ సెటిల్మెంట్ ఆక్ట్ తీసుకువచ్చుటకు పూర్వంఉన్న గ్రామీణ రిపబ్లిక్‌వ్యవస్థ దెబ్బతిన్నది. పూర్వం ఎవడు అరకకట్టి పొలం దున్నితే వాడిదే ఆ పొలం. దున్నుకున్నంతకాలం వాడికే వర్తించేది. గ్రామమంతా సమిష్టి కుటుంబంగా పని చేసేది. కానీ ఆక్ట్ వచ్చాక ఆ వ్యవస్థ విధ్వంసమై సంక్షోభం ఆరంభమయింది పన్నులు పెరగడం, కులవృత్తులు దెబ్బతినడం సంక్షోభంలోని ముఖ్యాంశాలు. దీని ద్వారా గ్రామీణ వ్యవస్థ భూస్వామ్య వ్యవస్థగా రూపొందినదంటే ఆశ్చర్యం వేస్తున్నా అది వాస్తవం. ఉత్పత్తిలో ఆరవభాగం రాజుకు అనాడు చెల్లిస్తే సరిపోయేది. కానీ ఆక్ట్ వచ్చి భూస్వామ్య వ్యవస్థ నెలకొనగానే శ్రమజీవి జీవితం నలిగిపోయింది. నిష్ఫలమైంది. భూమి క్రయ విక్రయములతో బ్రిటిష్ దమననీతి ధర్మాన్ని ధ్వంసం చేసింది. వ్యావసాయిక వ్యవస్థ పరిణామ చర్చ అంతా విశ్వనాథ నవలలోనే ఎక్కువగా నెలకొన్నదని చెప్పవచ్చు. ఒక క్రమ పద్ధతిలో సాధికారికంగా ఆధారాలతో సహా చర్చించడం రాఘవన్ చేశాడు.

మూడో అధ్యాయంలో నాగరక వ్యవస్థ పెరిగిన కొద్దీ యంత్రాల వినిమయమువల్ల కులవృత్తులు—కుటీర పరిశ్రమలు దెబ్బతిని వాటిపై ఆధారపడిన వారు దెబ్బతినడం జరిగింది. భారీ పరిశ్రమల ద్వారా ఇటు వ్యావసాయిక శ్రామికులు పారిశ్రామిక కూలీలుగా మారటం—కాలుష్యం పెరగడం—మనిషిని బలవంతంగా హైన్యస్థితిలోకి త్రోసివేయడం—మనిషి శ్రేయస్సును విస్మరించి ఉత్పత్తిని పెంచుకుంటూ పోవడం, లాభాల పోటీ ప్రధానమై మానవతా దృక్పథం నశించి సంక్షోభం పెరగడం....ఈ అంశాలను క్రమ పద్ధతిలో రాఘవన్ విశ్వనాథ నవలల ఆధారంగా ఇతర రచనల ఆధారంగా వివరించినాడు. ప్రకృతిలోని సమతౌల్యం (Ecological Balance) దెబ్బతినడం పట్ల విశ్వనాథ ఆవేదన చెందిన అంశాన్ని గ్రంథకర్త వివరించినాడు. మానవుని శ్రేయస్సును ప్రధానంగా భావించినవారు గాంధీ, విశ్వనాథ. వారి దృష్టిలో పూర్ణ మానవుడు' అన్నభావన ప్రధానంగా ఆర్థిక రాజకీయ వ్యవస్థా నిర్మాణ భావనలు రూపొందడం ఇక్కడ గమనించదగ్గ అంశం.

నాలుగో అధ్యాయంలో పరిపాలనా వ్యవస్థలో—ఆర్థిక వ్యవస్థ యొక్క మార్పుకోసం రావలసిన పరిణతిని విశ్వనాథ భావంఏ విధంగా ఆచరణీయమో గ్రంథకర్త వివరించినాడు. ముఖ్యంగా గ్రామ వ్యవస్థ యొక్క పరిపూర్ణత, స్వయంసమృద్ధిని నొక్కి చెప్పడం ప్రధానాంశం.

అయిదవ అధ్యాయంలో విశ్వనాథ ఆర్థిక, సామాజిక, రాజకీయ వ్యవస్థపట్ల చేసిన భావనలని పేర్కొంటూ వ్యక్తీ, సమాజమూ రెండూ ఏ విధంగా పురోగమించాలో విశ్వనాథ ఉద్దేశించిన రీతిని గ్రంథకర్త వివరించినాడు. 'కమ్యూనిజం + ఆధ్యాత్మిక నైతిక విలువలు = విశ్వనాథ భావించే వ్యవస్థ' అని సూత్రీకరణ చేయవచ్చును. గాంధీ విశ్వనాథ ఇద్దరు కూడా ప్రైవేటు ఆస్తులను వ్యతిరేకిస్తూ భారతీయ ఆర్థిక వ్యవస్థను మానవశ్రేయస్సు లక్ష్యంగా నైతిక విలువలతో పునర్నిర్మించాలని కోరుకునే వారే. ఈ అంశాన్ని రాఘవన్ స్పష్టంగా నిరూపించడం జరిగింది.

రాఘవన్ రచించిన ఈ గ్రంథాన్ని శ్రీమాత—శ్రీ అరవిందుల పాద పద్మములకు అంకితం చేశాడు. దీనికి 'ఆముఖము' పేరిట ముందుమాటను ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు రచించినారు.

**పాతూరి రఘురామయ్య**

# వార్తా వాహిని

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, హైదరాబాదు

**ది. 22-3-92**

### జాతీయ సమైక్యత సాధనకు హిందీ :

జాతీయ సమైక్యత పెంపొందించడానికి హిందీ భాషను విస్తృతంగా వ్యాపింప చేయాల్సిన అవసరం ఎంతైనా ఉందని సమాచార పౌర సంబంధ శాఖా మంత్రి శ్రీ పేర్ని కృష్ణమూర్తి అన్నారు. దక్షిణ భారత హిందీ ప్రచార సభ—ఆంధ్ర హైదరాబాదు ఆధ్వర్యంలో ది. 22.3.1992 నాడు హిందీ మాతృ భాష కాని రాష్ట్రాల్లో మాధ్యమిక స్థాయిలో హిందీ శిక్షణ సమస్యలు అనే అంశంపై ఏర్పాటైన ఒకరోజు సదస్సును మంత్రి ప్రారంభించారు. దేశానికి ఒక ఉమ్మడి భాష లేనందునే పంజాబ్, కాశ్మీర్ రాష్ట్రాల్లో ఏర్పాటువాద ధోరణులు ప్రబలినట్లు ఆయన అభిప్రాయపడ్డారు. ఇదే కారణంచేత కూడా ఆంధ్రప్రదేశ్‌లో జై తెలంగాణా, జై ఆంధ్ర ఉద్యమాలు వచ్చాయని శ్రీ కృష్ణమూర్తి అన్నారు. ప్రజలు సమైక్యంగా ఉంటేనే దేశాభివృద్ధి సాధ్యమని ఈ సమైక్యత కేవలం ఉమ్మడి భాష ద్వారానే సాధ్యమని ఆయన తెలియచేశారు. దేశంలో అధికార స్థాయిలోనూ వివిధ రాష్ట్రాల మధ్యను ఆంగ్లభాష లింక్ లాంగ్వేజ్‌గా ఉందని ఆయన అన్నారు. అయితే ఆంగ్ల భాష విదేశీ భాష అయినందున స్వదేశీ భాష అయిన హిందీని ప్రజలు నేర్చుకొనడానికి విస్తృత ప్రచారం అవసరమని పౌర సంబంధ శాఖా మంత్రి అన్నారు రాష్ట్రంలో హిందీ అధ్యాపకులు ఎదుర్కొంటున్న పలు సమస్యలను పరిష్కరించడానికి తనకు సాధ్యమైనంత కృషి జరుపగలనని శ్రీకృష్ణమూర్తి హామీనిచ్చారు. హిందీ అభివృద్ధికి గాను మచిలీపట్నం హిందీ ప్రేమీ మండలి భవనాన్ని నిర్మిస్తున్నట్లు ఆయన వెల్లడించారు.

ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించిన రాష్ట్ర పాఠశాల విద్యా సంచాలకులు శ్రీ కె. పెంచలయ్య ప్రసంగిస్తూ. దేశానికి హిందీ సమన్వయ భాషగా వుండాలి అనీ, అయితే దురదృష్టవశాత్తు ఇది కాలేకపోయిందని అన్నారు హిందీ భాషాభివృద్ధికి గను హిందీ ప్రచార సభను మహాత్మా గాంధీ ఏర్పాటుచేసి 18 సూత్రాల కార్యక్రమాన్ని నిర్వహించిన విషయాన్ని ఆయన గుర్తుచేశారు. దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు మాట్లాడుతూ ఆంధ్రప్రదేశ్‌లోని పాఠశాలల్లో హిందీ ఉపాధ్యాయులు ఎదుర్కొంటున్న సమస్యలు, ఇబ్బందులను ఈ సదస్సులో చర్చించనున్నామని వివ

రించారు. మొత్తం 23 జిల్లాల నుంచి ఉపాధ్యాయ ప్రతినిధులు హాజరయ్యారని ఆయన తెలిపారు. రాష్ట్ర హిందీ ప్రచారక మండలి అధ్యక్షులు శ్రీ కాజ వెంకటేశ్వరరావుగారు కూడా ప్రసంగించారు.

## సమస్యల్లో విద్యారంగం :

విద్యారంగంలో అనేక సమస్యలున్న ప్రస్తుత తరుణంలో కేవలం ఒక్క సమస్యపై దృష్టి కేంద్రీకరించే పరిస్థితులు లేవని రాష్ట్ర విద్యాశాఖ కార్యదర్శి శ్రీ కె. యస్. శర్మ అన్నారు. సెమినార్ ముగింపు సమావేశమునకు ఆయన ముఖ్య అతిథిగా విచ్చేసి ప్రసంగించారు. విద్యారంగంలో ఉన్న సమస్యలను సరిగా బేరీజు వేయడం కూడా ప్రస్తుత పరిస్థితులలో ఓ సమస్యగా పరిణమించిందన్నారు. విద్యార్థి దశలో మూడు భాషలు నేర్చుకున్న వారు భవిష్యత్తులో విశేషంగా రాణించగలరని తేలిందని ఆయన గుర్తు చేశారు. ఈ కారణంగా మన రాష్ట్రంలో విద్యార్థులు కూడా త్రిభాషా సూత్రానికి కట్టుబడి వుండాలని శర్మ సూచించారు. విద్యారంగ సమస్యలను సత్వరం పరిష్కరించడానికి పాలనాపరమైన ఇబ్బందులున్నాయని అన్నారు. హిందీ ట్రైనింగ్ కాలేజీలను పునరుద్ధరించే విషయంలో ప్రభుత్వం త్వరలో నిర్ణయం తీసుకో గలదని తెలిపారు. హిందీ భాషాభిమానులు సర్వేచేసి హిందీ భాష అభివృద్ధికి కేంద్రం ఎన్ని కార్యక్రమాలు చేపడుతుందనే విషయాలను, రాష్ట్రంలో లేనివి, ఇతర రాష్ట్రాలలో వున్న వసతుల గురించి నివేదించాలని ఆయన అన్నారు. ఆర్థికంగా ఎక్కువ భారం కాని సూచనలిస్తే హిందీ భాషాభివృద్ధికి సత్వరం చర్యలుచేపట్టగలనని ఆయ హామీ యిచ్చారు.

సంగోష్ఠి కార్యక్రమములు నాలుగు సమావేశములుగా జరిగినవి. రెండు మూడు సమావేశముల యందు హిందీ శిక్షణ మరియు ప్రశిక్షణయందు ఎదురౌ్కంటున్న సమస్యలపై చర్చలు జరిగినవి.

సమావేశములలో శ్రీ శీలం వెంకటేశ్వరరావు ప్రధాన సంపాదకులు, వివరణ పత్రిక, డా. వై. యస్. రావు, హిందీ అధికారి, దూర సంచార విభాగము, డా. సాయిలు, జిల్లా విద్యాఅధికారి, నిజామాబాదుజిల్లా, శ్రీ చవాకుల నరసింహమూర్తి ఆంధ్ర సభ కోశాధ్యక్షులు శ్రీ కెదారు మల్లయ్యగారు ఆంధ్రసభ కార్యవర్గసభ్యులు, శ్రీనివాస వ్యాపారి బి.ఇడి. కాలేజి, ద.భా. హిం ప్ర. సభ, ఎం.ఎం. చౌహాన్, రీడరీ కేంద్రీయ హిందీ సంస్థాన్ హైద్రాబాదు మరియు శ్రీ అ. శంకరశాస్త్రి దక్షిణ భారత హిందీ ప్రచారసభ—ఆంధ్ర కార్యనిర్వాహక కార్యదర్శి పాల్గొని ప్రసంగించిరి.

శ్రీ గోదాతిరుమలయ్య గారు ఆంధ్రసభ కార్య వర్గ సంగోష్ఠి నివేదికను సభకు సమర్పించిరి.

సభ కోశాధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహ మూర్తి వందన సమర్పణచేసిరి.

## హిందీమీడియం బి.ఇడి. కళాశాల వార్షికోత్సవం

ది 1-3-'92 ఆదివారం సాయంత్రం 6-30కు మాచవరం, విజయవాడలోని మా కళాశాల ఆవరణలో దక్షిణ భారత హిందీ ప్రచారసభ మద్రాసు విశ్వవిద్యాలయ రిజిస్ట్రారు శ్రీ V.S. రాధాకృష్ణన్ గారి అధ్యక్షతన హిందీ మీడియం డిగ్రీకళాశాల వార్షికోత్సవం వైభవోపేతముగా జరిగినది. ఆ సభకు ముఖ్య అతిథిగా, ప్రధానవక్తగా విజయవాడ డివిజన్ సబ్ కలెక్టర్ శ్రీమతి షాలినిమిశ్రా IAS విచ్చేసి క్రీడలలోను, వకృత్వ పోటీలలోను, బి.ఇడి ట్రైనింగ్‌కు కావలసిన వస్తుసామగ్రి తయారు చేయుటలో ప్రథమ శ్రేణిలో గెలుపొందిన వారికి

బహుమతులు ప్రదానం చేసిరి. వారు తమ సందేశములో ప్రతి భాషకు రెండు రూపాలు ఉంటాయి. అవి 1. వాడుకభాష 2. సాహిత్యభాష. వాడుక భాషను ప్రచారం చేయుటం ప్రజా ప్రభుత్వముల యొక్క కర్తవ్యము. ఈవిషయాన్ని హిందీ ప్రచారకులు గుర్తించి, హిందీ అభివృద్ధికి కృషిచేయవలసినది అని ఉద్బోధించారు.

అధ్యక్షులు రాధాకృష్ణన్‌గారు తమప్రసంగంలో విజయవాడ హిందీ ప్రచార ప్రధాన కేంద్రమని, ఇటువంటి చోటున పి.జి. కోర్సును ప్రారంభించడం కళాశాల ప్రిన్సిపాల్ జయంత్‌కాయర్ గారు రిపోర్టులో కోరటం అనేది చాలా సమంజసం అని ఇందులకు తాము స్వయముగా సుముఖంగా ఉండటమే కాకుండా కమిటీలో ప్రతిపాదించి ఈ సం.ము జూన్ నాటికి కొన్ని పాఠ్యక్రమాలు విజయవాడలో ప్రారంభించటానికి శ్రద్ధ వహిస్తున్నానని శ్రోతల హర్షోల్లాసము మధ్య వాగ్దానము చేశారు.

చివరకు విద్యార్థిని, విద్యార్థులు సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు సభకు విచ్చేసిన పెద్దలకు, పిల్లలకు తేనీరు ఇవ్వబడినది.

## గుంతకల్లులో గణతంత్ర దినోత్సవము మరియు హిందీ విద్యార్థి మేళా

తేదీ. 26-1-92 ఉదయం తిలక్‌నగర్ లోని సభా భవనంలో 7.30 ని॥లకు కుమారి యస్. యస్. బేగం, కు॥ యస్. లక్ష్మి, కు॥ వి. ఉష, కు॥ శ్రీ స్వప్నల ప్రార్థనతో కార్యక్రమం ప్రారంభమైనది. ద. భా. హిందీ ప్రచార సభ-ఆంధ్ర కార్యవాహక కార్యదర్శి శ్రీ అన్నదానం శంకరశాస్త్రిగారు పతాకావిష్కరణ గావించిరి. శ్రీ శంకరశాస్త్రిగారు విద్యార్థినీ విద్యార్థులనుద్దేశించి మాట్లాడుతూ జాతిపిత మహాత్మాగాంధీగారు 1918లో తమ కుమారులచే ద.భా. హిందీ ప్రచార సభను మద్రాసులో స్థాపించినారు. హిందీ అభివృద్ధి జరుగుచున్న పద్ధతి మరియు జరగవలసినది తెలుపుతూ విద్యార్థినీ విద్యార్థుల నాశీర్వదించిరి.

తదుపరి హిందీ ప్రేమీ మండలి, గుంతకల్లు, కార్యదర్శి శ్రీ కె. గంగిరెడ్డిగారు మరియు హిందీ ప్రేమీ మండలి, గుంతకల్లు కార్యవర్గ సభ్యులు శ్రీ కె. వి. సుబ్బారావుగారలు ప్రసంగించారు. ద. భా. హి. ప్ర. సభ-ఆంధ్ర గుంతకల్లు శాఖ వ్యవస్థాపకులు శ్రీ వి. కమలాకర్ ధన్యవాద సమర్పణగావించిరి. 'జనగణమణ' జాతీయగీతాలాపనతో కార్యక్రమం ముగిసినది.

## హిందీ విద్యార్థి మేళా :

ది. 26-1-92 ఉదయం 9.40 నిముషములకు మునిసిపల్ బాలుర పాఠశాల యందు హిందీ విద్యార్థిమేళా ప్రారంభమైనది. విద్యార్థిమేళా ప్రారంభమున ఉద్ఘాటన సమారోహము జరిగినది. ఆనాటి సమారోహములో హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ వంకదారు రామకృష్ణయ్యగారు 'హిందీ విద్యార్థిమేళా ప్రారంభించిరి. ద. భా. హిందీ ప్రచార సభ-ఆంధ్ర కార్యవాహక కార్యదర్శి శ్రీ శంకరశాస్త్రి గారు ముఖ్య అతిథులుగా విచ్చేసిరి. మునిసిపల్ బాలుర పాఠశాల హెడ్మాష్టరు శ్రీ యం. సుంకప్పగారు మరియు హిందీ ప్రేమీ మండలి కార్యదర్శి శ్రీ గంగిరెడ్డిగారు వేదికనలంకరించిరి.

శ్రీ వంకదారు రామకృష్ణయ్యగారు విద్యార్థినీ విద్యార్థులనుద్దేశించి మాట్లాడుతూ, 'గుంతకల్లులో హిందీ విద్యార్థిమేళా 4వసారి జరుగుచున్నదని,

ఈ మేళావల్ల పరీక్షార్థులు చాలా లాభము పొంద గలరని, ఇట్టి మేళాలు తరచుగా జరుపబడుట హిందీ ప్రచారమునకు దోహదకారి కాగలదని తెలుపుతూ విద్యార్థిమేళా విశిష్టతను వివరించిరి. శ్రీ శంకరశాస్త్రిగారు ప్రసంగిస్తూ విద్యార్థులకు ఈ మేళావలన కలుగు లాభమును గురించి సవివరంగా విద్యార్థినీ విద్యార్థులకు తెలుపుతూ ఎక్కువ సంఖ్యలో విద్యార్థులు హాజరుకాగలిగినందులకు మరియు స్థానిక హిందీ పండితులు సహాయ సహకారాల నందించినందుకు ఆంధ్ర సభ తరపున ధన్యవాదములు తెలిపిరి. తదనంతరం శ్రీ యం. సుంకప్పగారు మాట్లాడుతూ మేళా విశిష్టతను తెలియచేసారు. శ్రీ కె. గంగిరెడ్డి గారు మేళా యొక్క విశిష్టతను వివరంగా తెలిపి విద్యార్థులను ఆశీర్వదించిరి. గుంతకల్లుశాఖ వ్యవస్థాపకులు శ్రీ వేమూరి కమలాకర్ తమ ధన్యవాద సమర్పణతో ఈ విద్యార్థిమేళాలో స్థానికులు సుమారు 300 మంది విద్యార్థినీ విద్యార్థులు, 23 మంది హిందీ పండితులు, హిందీ అభిమానులు మరియు పాల్గొని పెద్దలకు దన్యవాదములు తెలిపిరి.

## హిందీ ప్రేమీమండలి, సికింద్రాబాదు ప్రమాణ పత్ర వితరణోత్సవము

తేది 1–3–92 సికింద్రాబాదు, ద్వారా నిర్వహించబడుచున్న శరత్ హిందీ విశారద విద్యాలయమునందు ప్రమాణ పత్ర వితరణము 'శ్రీ అన్నదానం శంకరశాస్త్రి'. కార్యవాహీ కార్యదర్శి ద.భా. హిందీ ప్రచార సభ గారి అధ్యక్షతన జరుపబడినది. విద్యార్థుల ప్రార్థనతో కార్యక్రమము ఆరంభింపబడినది.

విద్యాలయ ప్రాచార్యులు శ్రీ యం. రఘుపతి గారు అతిథులకు స్వాగతమును పలికిరి. ఈ సందర్భములో శ్రీ రంగనాథాచార్యులు, శ్రీ కృష్ణమూర్తిగార్లు, హిందీ భాష యొక్క గొప్పతనమును మరియు హిందీ భాష వలన కలిగే ఉపయోగములను గూర్చి విద్యార్థులకు తెలిపినారు. ముఖ్యఅతిథి శ్రీమతి విజయలక్ష్మి, శ్రీ కృష్ణమూర్తి మరియు శ్రీ కృష్ణప్రసాదుగార్లు విద్యార్థులకు ప్రమాణ పత్రములు మరియు బహుమానములు ప్రదానము చేసిరి.

శ్రీ శంకరశాస్త్రిగారు హిందీ ప్రచారసభ కార్యక్రమాలు, హిందీ ప్రచార, ప్రసారములను గూర్చి వివరించినారు. హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ రఘుపతిగారు సభకు ధన్యవాదములు తెలిపిరి. జాతీయ గీతాలాపనతో సభ ముగిసినది.

## జిల్లా హిందీ ప్రచారక్ మండలి చిత్తూరు

చిత్తూరు జిల్లా హిందీ ప్రచారక మండలి సర్వసభ్య సమావేశము తేది 29-12-91 ఆదివారం మధ్యాహ్నం 2 గంటలకు మండలి అధ్యక్షులు శ్రీ జె. దొరస్వామి రెడ్డిగారి అధ్యక్షతన రామారావు మునిసిపల్ స్కూలు, మదనపల్లెలో జరిగినది.

తొలుత మాజీ భారతదేశ ప్రధాన మంత్రి దక్షిణ భారత హిందీ ప్రచార సభ అధ్యక్షులు స్వర్గీయ రాజీవ్ గాంధీ అకాల మరణమునకు స్వతంత్ర సమర సేనాని స్వర్గీయ హయగ్రీవాచారి హిందీ ప్రచారకులు శ్రీ మూరి తిర్వేన్నగారి (పలమనేరు) అకాలమరణమునకు శ్రద్ధాంజలి ఘటించుచూ సంతాపము ప్రకటించిరి.

తదుపరి శ్రీ కె.కె. ఆచారిగారి ప్రార్థనతో సర్వసభ్య సమావేశం ప్రారంభమైనది. అధ్యక్షులు మండలి కార్యకలాపములను గురించి వివరించిరి. కార్యదర్శి వేమూరి సుబ్బారావు వార్షిక నివేదిక, ఆదాయ వ్యయ వివరములు రాబోవు

సంవత్సరమునకు బడ్జెటు సభకు సమర్పించిరి. అవి ఏకగ్రీవముగా ఆమోదించబడినవి.

రాబోవు రెండు సంవత్సరములకు 1992-93 ఏకగ్రీవముగా ఈ కార్యవర్గము ఎన్నుకొనబడినది.

అధ్యక్షులు శ్రీజె. దొరస్వామిరెడ్డి, నల్లగొండు ఉపాధ్యక్షులు : శ్రీ బి.జి.సుందరమూర్తి, చిత్తూరు ఉపాధ్యక్షులు : సి.వి సుగుణ శ్రీకాళహస్తి, ప్రధానకార్యదర్శి. వేమూరి సుబ్బారావు, మదనపల్లి సహాయ కార్యదర్శి : శ్రీఎల్ బుచ్చినాయుడు చెరులోపల్లి, సహాయ కార్యదర్శి: వై సిద్ధారెడ్డి కోణ, సభ్యులు : ఎ. అనంత శేషగోపాలాచారి, రామ సముద్రము శ్రీ కె. నారాయణచార్య—మదనపల్లి, శ్రీ.కె.కె ఆచార్య—తిరుపతి, శ్రీ ఈశ్వర రెడ్డెప్ప-పలమనేరు, శ్రీ వి. వెంకటాచారి—మదనపల్లి, శ్రీ ఎ.పి. అనంతశయనం అయ్యంగార్ చిత్తూర్, శ్రీమతి వి.ఎస్ రాధాబాయ్- చిత్తూర్, శ్రీమతి ఎస్ ఛాయాదేవి-చిత్తూర్, శ్రీమతి బి.సరస్వతి-మదనపల్లె

ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారకమండలికి ఈ క్రింది వారు ఏకగ్రీవముగా ఎన్నుకొనబడిరి. వీరు వరుసగా రెండు సంవత్సరములకు పైగా పైమండలికి సభ్యులుగా వున్నారు. 1. శ్రీబి.జి సుందర మూర్తి చిత్తూరు. 2. శ్రీ కె.కె. ఆచార్య తిరుపతి 3. శ్రీ ఎల్. బుచ్చి నాయుడు చెరులోపల్లి 4. శ్రీమతి సి. వి. సుగుణ-శ్రీకాళహస్తి.

తదుపరి దక్షిణభారత హిందీ ప్రచారసభ—ఆంధ్రశాఖకు శ్రీ వేమూరి సుబ్బారావు దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర శాఖకు కార్యవర్గ సభ్యులుగా ఎన్నికైనందుకు మండలి అధ్యక్షులు శ్రీ ఎల్.బుచ్చినాయుడు గారిని ఘనముగా సన్మానించిరి. సన్మానానికి శ్రీ ఎల్. బి. బుచ్చినాయుడు గారు తమ కృతజ్ఞతలు తెలిపిరి. దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్ర శాఖకు ఎన్నికైన నూతనకార్యవర్గమునకు తమ ధన్యవాదములు తెల్పిరి.

శ్రీ అనంత శేషగోపాలాచారి వందన సమర్పణతో కార్యక్రమము జయప్రదముగా ముగిసినది

## కేంద్ర ప్రభుత్వ ప్రణాళిక ప్రకారం సహాయక ప్రచారకులకు సూచనలు

1. 1992 సెప్టెంబరు సెషనుకు (ఏప్రిల్ నుండి సెప్టెంబర్ వరకు) సహాయక్ ప్రచారకులుగా నియుక్తి పొందగోరు వారు తమ ప్రార్థనా పత్రములను ది. 31-5-1992 లోపల తప్పక పంపవలెను. ప్రతినెల కార్యవివరణములు హిందీ లోనే నింపి తదుపరి నెల 5వ తేదీలోగా మా కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

పై తేదీ తరువాత వచ్చిన ప్రార్థనా పత్రములు, నెలసరి కార్యవివరణములును పరిశీలించబడవు. వాటిని గురించి, ఉత్తర ప్రత్యుత్తరములు వుండవు.

2. 1992 ఫిబ్రవరి పరీక్షా ఫలితములు వెలువడగానే గ్రాంటు పొందిన సహాయక ప్రచారకుల పరీక్షా ఫలితముల వివరము అనగా పరీక్షార్థి పేరు, పరీక్షా ప్రవేశ పత్రముల క్రమసంఖ్య, ఉత్తీర్ణతలేక అనుత్తీర్ణత గురించిన వివరములను తెల్లకాగితముపై వ్రాసి దానితో "परीक्षार्थियों के आंकडों से संबंधित पत्र" నింపిపంపవలెను.

3. కొంత మంది సహాయక ప్రచారకులు హాజరు పుస్తకములపై ప్రతినెల విద్యార్థుల పేర్లు వ్రాయుటలేదు. యిట్లుగాక ప్రతినెల విద్యార్థుల పేర్లు తప్పక వ్రాయవలెను. ప్రతినెల చివర ఉపాధ్యాయుని పూర్తిసంతకము వుండవలెను.

సంగఠకులుగాని సభ నుండి అనుమతి పొందిన నిరీక్షకులు గాని తరగతులు తనిఖీ చేయుటకు వచ్చినపుడు వారికి హాజరు పట్టికలు కూడా తప్పక చూపవలెను. సహాయక ప్రచారకులు స్వయముగా తరగతులు నిర్వహించే వారై వుండవలెను. ఇతర కేంద్రములలోని విద్యార్థుల పేర్లు చూపరాదు.



సమాచార పౌర సంబంధ శాఖా మంత్రి శ్రీ పేర్ని కృష్ణమూర్తిగారు ప్రసంగిస్తున్నారు.



ద. భా. హిందీ ప్రచారసభ–ఆంధ్ర-శాఖ అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు ప్రసంగిస్తున్నారు.

Edited Printed and Published by P Prasada Rao on behalf of the D. B Hindi-Prachar Sabha- Andhra, Khairatabad Hyderabad-500 004,